

ద్రవ్యదాత శ్రీ జిన్ను శ్రీరాములు, శ్రీమతి లక్ష్మీదేవి,
చి॥ రఘు చిన్మయి, చి॥ కేదారనాథ్

# ఆత్మైక బోధ

ద్విపద






పరిష్కర్త
కపిలవాయి లింగమూర్తి

# ఆత్మైక బోధ (ద్విపద)

రచన

యోగానందావధూత

పరిష్కర్త

కపిలవాయి లింగమూర్తి

# ఆత్మైక బోధ (ద్విపద)

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి 2008

ప్రతులు : 1,000

వెల : రూ. 30/-

*లేజర్ టైప్ సెట్టింగ్ :*

**యాపిల్ గ్రాఫిక్స్**

6-1-890, ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004.

ఫోన్ : 2323 1229, సెల్ : 98497 91229

*ప్రింటెడ్ ఎట్ :*

**ఆరతి ప్రింటర్స్**

హైదరాబాద్

*ప్రతులు లభించు చోటు :*

**కె. కిశోర్ బాబు**

'వాణీ సదనం', 17-110, విద్యానగర్ కాలనీ,

నాగర్‌కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లా.

ఫోన్ : 08540-226437





## ద్రవ్యదాత పరిచయం

ఈ పుస్తకం ముద్రింపించినవారు జిన్ను శ్రీరాములు గారు. వీరు పద్మశాలీలు. గౌతమ ఋషి గోత్రులు. వీరి యింటి పేరు జిన్ను. వీరి నివాసము గొరిట గ్రామం. వీరి పూర్వీకుల స్వస్థానం కోయిల కొండ. మూల పురుషుడు చిన్నయ్య.

చిన్నయ్య కుమారుడు వెంకప్పకు బుడ్డప్ప, పెద్దవీరప్ప, వీరప్ప, చిన్నయ్య అనే నలుగురు సంతానం కలిగినారు. వెంకప్ప వైద్య శాస్త్రంలోనూ, మంత్ర శాస్త్రంలోనూ ప్రతిభ కలిగి గంత కోడెపై తిరుగుతూ గ్రామగ్రామాన వైద్యం చేస్తుండేవాడు. ఈ క్రమంలో వెంకప్ప కోయిల కొండను విడిచి కుటుంబంతో సహా పరిగి తాలూకాలోని బలుసుల గొండకు వెళ్ళినాడు. ఇది పగిడ్యాలకు దగ్గరగా ఉంటుంది. ప్రస్తుతం ఈ గ్రామం గండీడు మండలంలో ఉంది.

పై సోదరులలో చిన్నయ్య భార్య తుపాకుల లక్ష్మయ్య గారి మనుమని కూతురు మణెమ్మ గారు. మణెమ్మ గారిని వీరి తల్లిగారి గ్రామం (పారుపల్లి/ కోయిలకొండ)లో పోశమ్మ అని పిలుస్తారు.

తుపాకుల వారి ఇంటిపేరు ఏడవవారు. లక్ష్మయ్య తుపాకిలో మంచి గురికాడుగా ఉండేవాడు కాబట్టి అదే ఇంటిపేరుగా నిలిచిపోయింది. ఈయన లోకయ్యపల్లె లక్ష్మమ్మ దొరసానిగారి కాలంవాడు. లోకాయపల్లి వారు దేవీ ఉపాసకులు. ఒక పర్యాయం ఆమె తమ తోటలో డేరా వేయించుకుని నిష్ఠలో ఉండగా దినదినం ఒక గ్రద్ద ఎక్కడ నుండియో మాంసం ముద్దలు పట్టుకొని వచ్చి డేరాపై విడిచిపోతుండేది. అపుడామె వేటకాండ్రనెందరిని పిలిచి ఆగ్రద్దను వేటాడమన్నా వారి నుండి కాకపోగా లక్ష్మయ్య యొక్క ప్రశస్తిని విని ఆయనను పిలిపించిందట. అపుడాయన తుపాకి బారు పెట్టుకొని డేరా వెనుక

కదలకుండగా వెల్లకిలా పడుకొని ఒకే దెబ్బతో ఆడేగను కొట్టినాడట. అపుడామె అతని గురికి మెచ్చుకొని బహుమానమిచ్చి ఆనాటి నుండి ఆయనకు తుపాకుల లక్ష్మయ్య అని యింటిపేరు స్థిరపరిచినదట.

ఆయన మనుమని పేరు మళ్లీ లక్ష్మయ్యనే. ఈయన కూడా మంచి ప్రతిభావంతుడు. పద్మశాలీ వంశంలో అన్ని రంగాలలో గూడ ప్రతిభావంతు లెందరో ఉన్నారు. కోలాటం పాటలు, పీర్ల పండుగ, అలాయి పాటలు ఆశువుగా అల్లేవాడు. మూడు పీటలు ఒకదానిపై ఒకటి ఉంచి మూడు రోకండ్ల దరువుల్ని సృష్టిస్తూ దంపుడు పాటలు పాడేవాడు. ఎంతోదూరాన ఉన్నవారికి కూడా స్పష్టంగా వినిపించేట్టుగా గొంతెత్తి ఆలపించడం లక్ష్మయ్య సొత్తు. దీనికి తోడు ఈయన గొప్ప బలశాలి. చేతి యొక్క రెండు బొటన వ్రేళ్ళపై పందెం గుండ్లను ఎత్తి వీపు వెనుకకు వేసేవాడు. కుడి మోచేతి కొంకీతో మంచం యొక్క ఒక కోడును పట్టి మంచాన్ని మొత్తం పైకెత్తేవాడు. మోచేతి బొటనవ్రేళ్ళపై తలక్రిందులుగా నడిచేవాడు. ప్రతిభ అనేది ఒకరిలో ఒక తీరుగా ఉండదు గదా! ఈయన కూతురైన మణెమ్మ కుమారుడే శ్రీరాములుగారు.

చిన్నయ్యకు శ్రీరాములు, లక్ష్మయ్య, వెంకటస్వామి, మాధవస్వామి అని నలుగురు కుమారులు, ఈశ్వరమ్మ, విమల అని ఇద్దరు కూతుళ్ళు కలిగినారు. చిన్నయ్య యువకుడుగా ఉన్నపుడు కాంగ్రెస్ ప్రచారోద్యమంలో ఊరూరా జండాలెగరేసే ఉద్యమం బాగా నడుస్తున్నది. అపుడు బలుసులకొండ, కోస్గి పరిసర గ్రామాలలో 9 మంది యువకులను కూడగట్టుకొని జట్టుకు నాయకత్వం వహిస్తూ జండాలెగురేసేవారు. ఆనాడు జండా పట్టుకోవటం నేరంగా ఉండేది. అందువల్ల ఆయనను అరెస్టు చేసి పోలీసులు 13 దినాలు గుల్బర్గా చెరసాలలో పెట్టినారు. జైలు నుండి విడిచిన పిమ్మట చిన్నయ్య నారాయణపేటకు వచ్చి జూనియర్ బేసిక్ ట్రైనింగ్‌లో చేరినాడు. విద్యార్థులకు, ఉపాధ్యాయుల నడుమ సమస్యలేర్పడి సమ్మెకు దారి తీసింది. చిన్నయ్య ఎపుడైనా ఉద్యమాలకు ముందుండేవాడు కాబట్టి సమ్మెకు ముందు నిలిచినాడు. చివరకు ఉపాధ్యాయులు దిగివచ్చి విద్యార్థులు గెలిచినారు. పరీక్షలు వ్రాసి నెగ్గినారు. అనంతరం ఉద్యోగాల వంతు వచ్చింది. అపుడు కోర్టు మరియు ప్రభుత్వ



నిబంధనల ప్రకారం డివిజన్ మార్చుచేసి దూర ప్రాంతమైన గంగాపురం దగ్గరలోనున్న నెక్కొండకు పోస్టింగిచ్చినారు. తదుపరి వెంకాయపల్లె, మారేపల్లి, సిరసవాడ, ఐతోలు, గోవిందాయపల్లి, చేగుంట, గొరిట గ్రామాలలో ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించారు. చిన్నయ్య ఆర్.ఎం.పి. వైద్యుడుగా కూడా ఉన్నాడు. స్వాతంత్ర్యానికి పూర్వం నైజాం లెక్కలలోని వైద్యులలో పద్మశాలీలే ఎక్కువ. ఆకాలంలో సైకిలు వాడటం విరివిగా లేదు. చిన్నయ్యగారు సైకిలునుపయోగించి చుట్టుప్రక్క గ్రామాలలో తిరిగి వైద్యం చేసేవాడు. నాడీ నిదానంలో చిన్నయ్య గారు ప్రసిద్ధులు. శరీర తత్వాలను అనుసరించి వైద్యం చేయడం చిన్నయ్యగారి ప్రత్యేకత. అట్లా తిరగటంలో గొరిటలో తొగుట చెన్నప్పగారితో పరిచయం కలిగింది. ఆయన వైద్యం చూసి చెన్నప్పగారు తమ ఇంటిలోనే ఆశ్రయం ఇచ్చినాడు. దానితో చేగుంట నుండి గొరిటకు నివాసం మార్చినాడు. ధార్మిక చింతన గలవాడు కనుక తన అన్నగారైన చిన్నవీరప్పగారి కుమారులిద్దరిని కిష్టయ్య, రాఘవులులను తన దగ్గరనే యుంచుకొని చదివించినాడు. వీరు కూడా విద్యాశాఖలో ఉన్నత అధికారులుగా ఎదిగినారు. జైలుకు వెళ్ళినందువల్ల స్వాతంత్ర్య సమరవీరులలో రావలసినవాడేగాని అప్పటికాయనకా దృష్టి లేదు. కాబట్టి సకాలంలో పైరవీ చేసికోలేకపోయినాడు. మన జిల్లాలో తప్పిపోయినవారు కూడా ఇంకా కొందరున్నారు.

చిన్నయ్య సంతానంలో మొదటివాడు శ్రీరాములు. ఈయన ఇపుడు ఎ.పి. గ్రామీణ వికాస్ బ్యాంక్‌లో ఆఫీసర్‌గా ఉన్నాడు. ఈయన భార్య ఖిల్లా గణపురం వాస్తవ్యులయిన క్యామ తిరుపతయ్య గారి రెండవ కూతురు లక్ష్మీదేవి గారు. ఈ దంపతులకు రఘు చిన్మయి, కేదారనాథ్ అను సంతానం కలిగినారు.

శ్రీరాములు అందరివలెనే ఉద్యోగియైనా అందరి మార్గంలో లేడు. ఈ దంపతులిద్దరూ అదృష్టవశంగా ఆధ్యాత్మిక మార్గం వైపు మొగ్గి ఉండటం ఒక విశేషం. వీరి తండ్రియైన చిన్నయ్యగారు శ్రీ దయానంద పొన్నాల రాజయోగి (సికింద్రాబాద్) గారి శిష్యులు కనుక యిపుడు కుమారుడు గూడ ఇదే మార్గంలో పయనిస్తూ ఈ 'ఆత్మైక బోధ'ను తండ్రిగారి స్మారకంగా ముద్రింపించినాడు.

# స్మృతి

**మంజరి :**
పద్మశాలి కులాన ప్రభవించినట్టి
సధర్మరతుడైన జనకునిపేర
గౌతమ గోత్రాన గలిగినయట్టి
పుణ్య శీలుండైన పురుషుని పేర
జిన్ను వంశంబున వన్నెకు నెక్క
సన్మార్గు డైనట్టి జనకునిపేర
జాతీయ భావాన స్వాతంత్ర్య సమర
కాలాన పాల్గొన్న కర్మిష్టి పేర
ఉద్యమాలకు ముందు నుండెడునట్టి
స్వాభావి కుండైన సత్యుని పేర
దేశి వైద్యమునందు వాసిగన్నట్టి
చెయివాసి గలిగిన జీవకుపేర
జూనియర్ బేసిక్కు ట్రైనింగు పొంది
ఆధ్యాపకుండైన అచలుని పేర
హెడ్మాస్టరుగ బడు లెల్లను దీర్చి
మెచ్చును గన్నట్టి సిచ్చకుపేర
పొన్నాల రాజయ్య బోధకు మురిసి
పాడంబు పట్టిన - ప్రశ్రితుపేర
తమతండ్రి యగుచును తత్వంబుదెలిపి
బాపుయై తమనాది వారానబెంచి
శిక్షణిచ్చిన యట్టి చిన్నయ్యపేర
తండ్రిగా తనయుల తలమిన్నగోరి
క్రమశిక్ష నేర్పిన - ఘనగుణుపేర
జిన్ను శ్రీరాములు యెన్నుకదీని
ప్రియపడి ముద్రణ వ్యయము భరించె
తండ్రి మార్గంబిట్లు తప్పక నడుచు
శ్రీరామునకు నెప్డు శ్రీరాముడిచ్చు
గావుత సర్వదా కామితములను.



# ద్రవ్యదాత వంశవృక్షం

## పితృ వంశం

గౌతమ ఋషి గోత్రం

జిన్ను చిన్నయ్య
వెంకప్ప
బుద్ధప్ప పెద్దవీరప్ప చిన్నవీరప్ప చిన్నయ్య
కిష్టయ్య రాఘవులు నారాయణమ్మ
శ్రీరాములు లక్ష్మయ్య వెంకటస్వామి మాధవస్వామి ఈశ్వరమ్మ విమల
బ్యాంక్ ఆఫీసర్ | ఆంధ్రప్రభ విలేఖరి | ఫార్మసిస్టు | ఆంధ్రభూమి విలేఖరి
రఘు చిన్మయి కేదారనాధ్

## మాతృ వంశం

ఎఱువ లక్ష్మయ్య (తుపాకుల)
జంబయ్య బసవప్ప*
చెన్నప్ప బాలప్ప లక్ష్మప్ప శాంతప్ప
రామన్న*
భార్యలు
బుద్ధమ్మ బాలకిష్టమ్మ
మణెమ్మ సరోజ
చిన్నయ్య భార్య పండరినాధ్

* రామన్నను భార్య అక్కమ్మ దత్తు తీసికున్నది. ఆయన అన్నగారైన లక్ష్మప్ప బిడ్డలిద్దరిని తానే పెంచి పెద్ద చేసినాడు.
* బసవపు వంశం గూడ ఇంత పెద్దగా ఉంది. ఇప్పటికి ఈ వంశీయు లందరు అన్నదమ్ముల పిల్లలవలె కాక అన్నదమ్ములుగానే ఉంటారు.



ద్రవ్యదాత తల్లిదండ్రులు
శ్రీ జిన్న చిన్నయ్య, శ్రీమతి మణెమ్మ గార్లు



# యోగానందావధూత

ఈయన దత్త సంప్రదాయానికి చెందినవాడు. లింగగురుని శిష్యుడు. ఇతనికి చింతలపల్లి లింగావధానులని పేరు. వీరి గురుపరంపర యిట్లా ఉంది.




చింతపల్లి లింగావధానుల శిష్యుడైన యోగానందావధూతవి గురుశిష్య సంవాదం, ఆత్మైక బోధ అనే రెండు ద్విపద కృతులు ప్రస్తుతం లభిస్తున్నవి. ఈయన తన రచనలో సామాన్య పాఠకుని దృష్టిలో ఉంచుకొని యతిప్రాసల గొడవను పెద్దగా పట్టించుకోలేదు.

చంద్రభాను విజయకర్త తరిగొప్పుల మల్లన గూడ దత్తాత్రేయ యోగి శిష్యుడే. ఈయన క్రీ.శ. 1586లో కర్ణాటక రాజ్యాన్ని పాలించిన వెంకటపతి రాయల యొక్క ఆశ్రితుడు. అందుచేత పరమానంద యతి కాలం 1586 అవుతుంది.

ఈ దత్తాత్రేయ యోగిది నెల్లూరి ప్రాంతమని శ్రీ ఆవంచ సత్యనారాయణ గారు భారతిలో ఒక వ్యాసం వ్రాసినారు కాబట్టి అతని శిష్య పరంపర గూడ అదే ప్రాంతానికి చెంది ఉంటుంది.

ఆరుద్ర గారు చంద్రభాను చరిత్రకర్త తరిగొప్పుల మల్లన, పరమానంద యతి యిద్దరు సమకాలికులని, మల్లన గారి కాలం క్రీ.శ. 1586 అని నిర్ణయించినారు.

ఆచార్య కొర్లపాటి వారు చంద్రభాను చరిత్ర క్రీ.శ. 1600ల ప్రాంతంలో రచింపబడి ఉంటుందని అభిప్రాయపడినారు.

పరమానంద యతి శిష్యుడు ధేనువుకొండ తిమ్మయ శిష్యుడు చింతల లింగావధానులు. లింగావధానుల శిష్యుడు యోగానందావధూత కనుక గురుశిష్యుల నడుమ సుమారు పది సంవత్సరాలైనా అంతరముంటుందని భావిస్తే పరమానంద యతికి యోగావధూత దాదాపు 45 సంవత్సరాల తరువాతి వాడవుతాడు కనుక 1586+45 = 1631 అనగా 16వ శతాబ్ది ప్రథమ పాదంలో ఈ కవిగారుండి ఉంటాడనవచ్చు. ఇది ఒక ఊహా నిర్ణయమేగాని నిశ్చయం మాత్రం గాదు.

ఇతని రచనలుగా కనిపించే గురుశిష్య సంవాదం, ఆత్మైక బోధ అనే రెండు కృతులు అద్వైత ప్రతిపాదకాలు. ఈయన యతిప్రాసల గొడవ మాకేల అన్నాడు కనుక ఈ ద్విపదలు "మంజరి" అనవచ్చు కాని యతిప్రాసల గొడవ మనకేల అన్నా వానిని మాత్రం పూర్తిగా త్రోసిరాజన్నవాడు మాత్రం గాదు. వీనిలో ద్విపదగా రెండేసి పాదాల ప్రాస పాటిస్తూనే వచ్చినాడు.



అద్వైతం శుద్ధమైన పరబ్రహ్మ తత్వానికి చెందింది. బ్రహ్మతత్వం నామరూప వర్జితం. అయితే దత్త సంప్రదాయమనబడే అచల యోగులు బ్రహ్మవస్తువు గుణాతీతం అని గూడ అంటారు. వారి మతంలో ఈ తత్వ దర్శనానికి సాంఖ్యం, తారకం, అమనస్కం, అచలం అని నాలుగు సోపానాలున్నవి. రాజయోగులమని చెప్పుకునే పీఠాల వారందరు తమ శిష్యులకీ మార్గాన్నే బోధిస్తారు కనుక యోగానందావధూత గారీ మార్గాన్నే తమ కృతులలో వివరించినాడు. వీనిలో మొదటిది గురుశిష్య సంవాదం కాగా రెండవది సతీపతుల సంవాదంగా ఉంది.

ఉపనిషన్వాఙ్మయమంతా దాదాపుగా గురుశిష్య సంవాదమే కాబట్టి ఈయన ఆత్మైకబోధలో భర్త తన భార్యకు బోధించినట్లు వస్తువును మలచటం నూతన ప్రక్రియ.

ఇహానికి సుందరి పరానికి దరి అని పండితరాయల సూక్తి. భర్త భార్యతో ఇహ సుఖాన్ని పొందుతు, స్త్రీలకు నేరుగా మోక్షావకాశం లేదు గాబట్టి తనతోపాటామెకు గూడ పరమ గతి లభింప జేయవలసిన బాధ్యత భర్తపై ఉంటుంది. ఆకారణంగా శ్రీయోగావధూత గారిందులో సతీపతులను శ్రోతగా వక్తగా చేయటం అపూర్వమేగాక సముచితమని గూడ అనక తప్పదు.

**గురుమతం యొక్క సోపానాలు :**

ఇవి నాలుగని మొదట చెప్పినాను. వానిలో మొదటిది సాంఖ్యం.

సాంఖ్యమనగా సంఖ్యా శాస్త్రమని, జ్ఞానమని (సమ్యక్ ఖ్యాయతే ఇతి) రెండర్థాలున్నవి. మొదటి యొక్క అర్థ విచార ప్రకారం మనమంటె ఎవరు? ఈ దేహమా! లేక ఇందులోని జీవుడా! జీవుడే అయితే అతడిందులోని ఏతత్వంలో ఉన్నాడనేది పరామర్శించవలసి ఉంటుంది.

ఈ దేహంలో ఇరువదైదు తత్వాలు, ఎనిమిది ప్రకృతులు, అయిదు కోశాలు, మూడు గుణాలు ఉన్నవి. కనుక వీనిలో ఒక్కొక్క దాన్ని విచారించి

వానిని నేతినేతి వాక్యాలతో నిషేధిస్తూ పోగా మిగిలేది ఏదో విచారించవలసి ఉంటుంది. అదే నేను అనే తత్వం. ఈ నేను అని పలికేవాడెవడో వానిని తెలిసికోవటం స్వస్వరూప సంధానం అనబడుతుంది. స్వస్వరూప సంధానమంటే తానెవరో తెలుసుకోవటమన్న మాట.

ఇక్కడ పంచీకరణ చక్రమీయబడింది. దాన్ని బాగా పరిశీలించండి.

సాంఖ్యంతో ఇరువదైదు తత్వాలతో ఏర్పడిన ఈ దేహంలో తానే తత్వంగాదని వానికంటె తాను వేరేనని తెలిసిపోతుంది. అపుడు వ్యక్తికింక తాను దేహంలోనికెట్లా వచ్చినాడు. ఈ దేహం నుండి మరియు ఈ దేహంతో ఏర్పడిన సంసారం నుండి ఏవిధంగా తప్పించుకోవలెననే ప్రశ్న ఉదయిస్తుంది.

వ్యక్తికి తానీ దేహ బంధాల నుండి మరియు సంసార బంధాల నుండి తప్పించుకునే విధానానికే తారకమని పేరు. తారకమనగా దాటించేదని అనగా ఈ దేహ బంధాల నుండి మరియు సంసార బంధాల నుండి అవతలికి దాటించేదని అర్థం. ఈ మార్గమంతా మంత్రమయం. ఈ దాటడాన్ని గురించి కవి చక్రవర్తి శ్రీ జాషువా -

**ఊరుంబేరును లేని ఏగగనమందో లీనమైయున్న ఆ**
**త్మారామున్నిను రక్తమాంస ఘటమధ్యంబందు బంధించి ని**
**స్సారంబైన మనుష్యనుండని వాసప్రాప్తి శాసించినా**
**డేరాబో! దాతడే సమర్థుడగునోయీ ముక్తినీకీయగన్.**

ఖం.భా. 2 శిశుప్రబోధ వ.2

ఎవడూరుపేరు లేని నిన్ను ఈ రక్తమాంసమయమైన ఘటంలో బంధించినాడో అతడే నిన్ను మళ్లీ తప్పించటానికి సమర్థుడని అంటాడు.

ఏది దేనిచేత పుడుతుందో అది మళ్లీ దానిచేతనే నశించటం ప్రకృతి ధర్మం కనుక ముక్తిగూడ అంతే. జీవునికి జన్మ అనే బంధం ఎవరిచేత కలుగుతుందో మళ్లీ మోక్షం గూడ అతనిచేతనే కలుగుతుంది అనే భక్తిమార్గ సూత్రం.



**పంచీకరణ చక్రం - ఆకారాలు - అధిదేవతలు - వర్ణాలు :**

| పంచ భూతాంశములు | పృధివీ పంచకం | ఉదక పంచకం | అగ్ని పంచకం | వాయు పంచకం | ఆకాశ పంచకం |
|---|---|---|---|---|---|
| ఆకాశాంశములు పసుపు | వాక్కు సరస్వతి | శబ్దము | శ్రోత్రం దిక్కులు | సమాన వాయువు నీలం | జ్ఞానం బ్రహ్మము |
| వాయవ్యంశములు ఆకుపచ్చ | పాణి దేవేంద్రుడు | స్పర్శము | త్వక్కు రుద్రుడు | వ్యాన వాయువు గోక్షీరం | మనస్సు చంద్రుడు |
| అగ్న్యంశములు ఎరుపు | పాదము విష్ణువు | రూపము | చక్షువు సూర్యుడు | ఉదాన వాయువు సౌరం | బుద్ధి బ్రహ్మ |
| ఉదకాంశములు తెలుపు | గుహ్యము ప్రజాపతి | రసము | జిహ్వ వరుణుడు | ప్రాణ వాయువు నీలం | చిత్తము క్షేత్రజ్ఞుడు |
| పృధివి అంశములు చిత్రవర్ణం | గుదము మృత్యువు | గంధము | ఘ్రాణం అశ్వినులు | అపాన వాయువు హరితం | అహంకారము విరాట్టు |
| సమిష్టి అంశములు | కర్మేంద్రియములు | పంచతన్మాత్రలు | జ్ఞానేంద్రియములు | ప్రాణేంద్రియములు | అంతరింద్రియములు |

హిందువులకు ప్రకృతి మండలంలో అనేకమైన దేవతలున్నారు. కనుక వ్యక్తి తానీ జన్మ బంధం నుండి తప్పుకోవటాని కెవరో ఒక దేవత నాశ్రయించటం లేదా విజ్ఞానంతో తనకు తానే దాన్ని వదిలించుకోవటం అని రెండు మార్గాలున్నవి. ఈ రెండు మార్గాలకు గూడ గురువనే వారొకరవసరం.

దేవతా సహాయం కోరేవారీ దేహానంతరం వారి లోకానికి చేరుతారు. అయితే వారి లోకానికి చేరితేనే చాలా! లేదా తాముగూడ ఆ దేవతా రూపం ధరించవలెనా లేదా ఆదేవతలో లీనం కావలెనా అనే ప్రశ్న ఉంది.

వైష్ణవంలో విశిష్టాద్వైతం ఇష్టదైవం యొక్క రూపాన్ని పొందటమే ముక్తి అంటే అద్వైతం ఆదైవంలో లీనంకావటం ముక్తి అంటుంది. ఈమత భేదాల ననుసరించియే ఒక్కటైన భక్తిమార్గంలో ద్వైతాద్వైత విశిష్టాద్వైతాలనే మతత్రయ భేదాలేర్పడినవి. అయితే వీనిలో మతమేదైనా జీవుడు మాత్రం మొదట ఆదేవతా లోకంలోనికి చేరవలసి ఉంటుంది. ముక్తి అనేది ఆ తరువాతి విషయం.

దేవతాలోకం చేరినవారు మహాప్రళయం వరకాలోకంలోనే దేవత యొక్క సన్నిధిలో ఆనందాన్ననుభవిస్తుండి మహాప్రళయంలో ఈ దేవతలనబడే వారందరు గూడ ఆవాసుదేవ పరబ్రహ్మంలో ప్రవేశించేవారే కాబట్టి ఏదేవతా బలగం ఆదేవత వెంట పరబ్రహ్మలో ప్రవేశిస్తారు. ఈ లోపల అవాంతర కల్పాలలో ఆయా దేవతా లోకాలలో ఉండే జీవులు వారి ఆజ్ఞచేత ఎక్కడైనా జన్మించవలసి ఉంటే జన్మించి తమయొక్క పని పూర్తికాగానే మళ్లీ యథాస్థానానికి వెళుతుంటారు. ఇట్టివారికి కర్మ అంటదు. వీరిని లోకం కారణజన్ములుగా గుర్తిస్తుంది. అయితే సగుణోపాసకులు అనగా దైవాన్ని ఏదో ఒక రూపభావన చేసి ఆరాధించేవారిలో చాలామంది పైన చెప్పిన తారకంతోనే ఆగిపోతుంటారు కనుక ఈ తారకాన్ని గురించి -



## తత్వం

ఏహై తర్కారిమండీ న సమ్‌ఝో దండి
యహాఁకె సబ్‌కామ్ ఖాలీ - బిల్కుల్‌సండీ -
తోష తయ్యార్‌కర్ ఉన్ సఫర్‌కేజరా
కామ్ ఆయెంగె ఉన్‌జాన మోటర్ బండీ -
తారకంసే మిలేంగీన ముక్తికభీ
మిల్ గురూసెతో మిల్‌జాయె మన్కీగుండీ
ముర్ఖుకొ బాజూ బితా బోలె కహేతే హబీబ్
చిక్నె మత్‌జా తు దున్యాకి ఏహైమొండీ -
ఏహై తర్కారి మండీ న సమ్‌ఝో దండీ -

అని పానుగంటి హబీబ్‌గారి శిష్యుడు - సాధకుడు తారకం వరకే ఆగిపోతే అందులోనే అతనికి ముక్తి లేదంటాడు.

తారకంలో రెండవది జ్ఞానమార్గం. అయితే తారకమేదైనా దానిలో అర్చన, జపం, ధ్యానం అనే సాధనలుంటవి. వానిలో అర్చన సగుణ మార్గానికి, ధ్యానం నిర్గుణ మార్గానికి చెందుతవి.

ఈ అర్చననే మనం ప్రస్తుతం పూజ అంటున్నాం. దీనిలో సాధకుడు ఇష్టదైవాన్ని షోడశోపచారాలతో పూజిస్తాడు. ఈ బాహ్యమైన పూజ బదులు గురుమార్గంలో ఉన్నవారు మానసికంగా ఈపూజను సంకల్పమాత్రంతో నిర్వహిస్తుంటారు. ఈ అర్చనలోనే మళ్లీ ఆదైవానికి సంబంధించిన మంత్రాన్ని జపించటం ఒక భాగంగా ఉంటుంది. అట్లాకాక విడిగా పూజానంతరంగాని లేదా సంధ్యాకాలాలలోగాని ఈ జపాన్ని చేయవచ్చు.

జపధ్యానాలు రెండు మనకు జంటపదాలు. జపం చేత అందులోని బీజాక్షరాలు మనలోని సూక్ష్మమైన జీవనాడుల్ని చైతన్యపరుస్తవి. ఆపిమ్మట

ధ్యానం మనయొక్క ధ్యేయమూర్తిని ఎదురుగా నిల్పుతుంది. అందువల్ల జపం యజ్ఞంగాను, ధ్యానం యోగంగాను మనవారు నిర్వచించినారు. జపం ఉపాంశు దశకు వచ్చిన పిమ్మట సాధకునికి తెలియకుండానే ఆగిపోవచ్చు. అపుడు అంతవరకు తాను ధ్యానంలో స్మరించిన మూర్తి ప్రత్యక్షమై నిలుస్తుంది. ఎపుడట్లా సాధకునికి ధ్యేయమూర్తి కన్నులముందు నిలుస్తుందో అపుడిక మనస్సు చలనముడిగిపోతుంది. కాబట్టి యిదే అమనస్క దశ.

అమనస్కమంటే మనస్సు లేకుండ కావటం కాదు. అది ప్రపంచం నుండి విముక్తమై ధ్యేయమూర్తి యందు నిలిచిపోవటం. అట్లా అది దానికి బాగా అలవాటైన పిమ్మట అదింక లేని సమానమే అవుతుంది. ఉదాహరణకు మనం శ్వాసనే తీసికోవచ్చు. మనయొక్క శ్రద్ధ ఉన్నా లేకున్నా అది దాని ప్రకారం నడుస్తుపోతూనే ఉంటుంది కాని శ్వాసిస్తున్నామనే స్పృహ మనకుండనే ఉండదు గదా! కనుక అమనస్క స్థితిగూడ యిట్టిదే. అది ధ్యేయ వస్తువుపై నిలిచిపోయిన పిమ్మట సాధకునికితర స్పృహ అంటు ఉండనే ఉండదు కాబట్టి అపుడు మనస్సున్నా లేని సమానమే. అతనికీ స్థితి అందుకున్నపుడే సంసార బంధం నుండి ముక్తి - అందుకే హబీబ్ గారు కేవలం తారకం చేతనే ముక్తి లేదని అది అమనస్కం వరకు ముందుకు సాగవలెనని సూచించినాడు.

సాంఖ్యంలో సాధారణంగా పంచీకరణం చెప్పబడుతుంది కాని ఈకవి అట్లాగాక యిందులో పరబ్రహ్మ స్వరూపాన్నే చెప్పినాడు.

**శ్రు॥ అజామేకం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతి స్వరూపామ్**

తైత్తరీయారణ్యకం ద్వితీయఖండం దశమానువాకం 5వ ఋక్కు

ఈ ఋక్కులోని "లోహిత శుక్ల కృష్ణాం" అనే దళాన్ని తీసికుని ఇందులో ఎఱుపు, తెలుపు, నలుపు అని మూడే వర్ణాలు చెప్పబడినవి కాని నీలం కూడ ఒకటి ఉందని



**"నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా**
**నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూ పమా**
**తస్యా శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః"** ॥మంత్రపుష్పం॥

"మేఘం వంటి ఆ నీలిరంగు నడుమ మెరుపు తీగవలె ప్రకాశిస్తు ఒక కాంతి, ఆ కాంతి నడుమ వరిముల్లు వలె పసుపుపచ్చగా ప్రకాశిస్తు అణు స్వరూపమైన ఒక శిఖ ఉంది. దాని నడుమ పరమాత్మ ఏర్పాటై ఉన్నాడు".

అనేదాన్ని బట్టి ఆనీలంలోని తటిత్కాంతియే జీవాక్షరమని ఆకాంతిలోని జ్యోతి నడుమ ఉన్న పరమాత్మనే పురుషుడని అతడే అక్షర పరబ్రహ్మమని తెలిపి ఈ తరువాత తారకాన్ని తీసికున్నాడు.

తారకమంటె మంత్రమయ భాగం. ఇది సగుణ తారకం, నిర్గుణ తారకం అని రెండు విధాలు. నిర్గుణానికి హంస తారకమని మరోపేరు. ఈ తారకం శుద్ధమైన వేదాంత పరంకాగా రామతారకం సగుణ స్వరూపంకాని ఈకవి తారకంలో మళ్లీ వానిని గూడ తడవలేదు. ఈ భాగంలో సృష్టి క్రమాన్ని వివరించినాడు. అదీ విధంగా ఉంది.

వెన్నెల బయులు ఎఱుకనబడుతుంది. దానిలో మొదట రాజసాహంకారం పుట్టింది. అది హిరణ్యతేజ చిద్బిందువు. దాని గర్భంలో శివకళ ప్రతిబింబించింది. ఆ బింబం నుండి కూటస్థమైన ఆకారం కలిగింది. బిందువు ఆకృతి ఆ రెండు కలువగా బిందువు నుండి పరాశక్తి పుట్టి సూక్ష్మ నాదమై ఊర్ధ్వముఖమై మితిలేని ఘోషతో మెరసింది. ఆ బుద్బుదంలో నిలిచి వెలిగే వెలుగే ఈనాడు శశి మండల మనబడుతుంది.

దాని క్రింద అర్కమండలముంది. అది అరుణవర్ణం. దాని క్రింద అగ్నిమండలముంది. అది రక్తశ్వేత నిభం. ఈ మూడు మండలాలలో నాద బిందువులు కలిసి అధోముఖమై ఉంటవి. వీని ధ్వని వైఖరీ పలుకనబడుతుంది.

ఈ సోమ సూర్యాగ్నులు మూడు కూడిన స్థలమే తారక లక్ష్యంగా ఉంది. దీన్నే అంతర్లక్ష్యమని, నభోముద్ర అని, ఆపోజ్యోతి అని అంటారు.

సూర్య చంద్రాగ్నులు మూడు కలసినపుడు నాదబిందువులు రెండు పుట్టినవి కనుక వానిలోని నాదమే ప్రణవం, బిందువు, ఆపోజ్యోతి అనబడినవి. వీనిలోని శివకళ సత్తు, చిద్బిందువు చిత్తు అనగా ఈశ్వరాంశ సత్తు, జీవాంశ చిత్తు. ఆ యిద్దరి సంయోగమే ఆనందం. అదే లింగాంగ సామరస్యం.

ఇందులోని చిద్బిందువే అంకపీఠం. శివకళ అనేది యిష్ట లింగం. ఇదే లింగాంగాల స్థానం. ఇదిపుడు మనకు పానవట్టం మరియు శివలింగంగా చూపబడింది.

కుండలినీ యోగంలో ఈ బిందువే కుండలిని అనబడుతుంది. ఇది నేత్రాంగంలోని సుషిరం అనగా కంటి యొక్క నల్లగ్రుడ్డులోని బిందువు. ఇదంతా ఆలోచించి చూడవలె. దీన్ని లక్ష్య దృష్టితో చూచినట్లయితే తారక చిహ్నామంతా సాధకునికి దీనిలోనే కనిపిస్తుంది. అందువల్ల తారకామృత సారంలో -

**చూడుమీ కనుపాపల నడుమనురా!**
**అసాధ్యమైన చోద్యమున్నది చూడుమీ**
**కనుపాపల నడుమనురా!** అని చెప్పబడింది. తత్వం-40

ఇది అంతర్లక్ష్యంగా చూడదగింది. ఇందుకు శాంభవీముద్ర ఉపయోగకరంగా ఉంటుంది. జిల్లెళ్ళమూడి అమ్మ ఈముద్రతోనే తన లక్ష్యాన్ని సాధించుకున్నదని చెప్పబడుతుంది.

శాంభవీ ముద్ర అంటే సాధకుడు సగుణంలో రామ లేదా శివ తారకాన్ని, నిర్గుణంలో అయితే హంస తారకాన్ని జపిస్తు మనస్సును, చూపును ఏకం చేసి చిదాకాశాన్ని చూడటం. చిదాకాశమంటే కనుబొమ్మల నడిమిభాగం. అక్కడతనికి చిత్కళలు కనిపిస్తవి.



ఈ ముద్రలో సాధకుడు పద్మాసనస్థుడై చేతులు రెండు చాపి చిన్ముద్రలు పట్టవలె.

చిన్ముద్ర అనగా జ్ఞానముద్ర. తర్జని అనగా చూపుడు వ్రేలును బొటన వ్రేలి గణుపు దగ్గర ఆనించి పట్టడం. మనయొక్క చూపుడు వ్రేలు అహంకారానికి అనగా జీవునికి, అంగుష్ఠం అనగా బొటనవ్రేలు పురుషునికి పరబ్రహ్మకు సంకేతం కాబట్టి చూపుడు వ్రేలును వంచి బొటనవ్రేలికి చేర్చటమంటె ఈజీవుడు తన అహంకారాన్ని ఆవిధంగా వంచుకొని పరమాత్మతో చేర్చటమని సూచన.

ఈ ముద్రను పరమశివుడు పార్వతికి తెలిపినాడు. కనుక ఇది ఆమె పేరుతో ప్రసిద్ధమయింది. ఆయన దక్షిణామూర్తిగా భద్రవటం క్రింద ఎల్లపుడు పదేశముద్రలోనే ఉండేవాడు. చిన్ముద్రనే ఇతరులకేదైనా బోధించే అపుడు చూపబడుతు ఉపదేశ ముద్ర అనబడుతుంది.

**శ్లో॥ చిత్రం వట తరోర్మూలే వృద్ధా శిష్యాః గురుర్యువా**
**గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్న సంశయః**

అనేది దక్షిణామూర్తి స్తవంలో ఒకటి. ఆయన అట్లా ఉపదేశ ముద్రలో కూర్చోగా ఎన్నో సందేహాలతో వచ్చే శిష్యులకది చూడగానే అనగా ఆయన నోట చెప్పకుండానే తీరిపోతుండేవట. కాబట్టి వేదాంత సందేశమంతా గూడ కేవలం ఈ ఒక్క ముద్రలో అనగా జీవుని ఈశ్వరునిలో చేర్చండి అనే మాటలోనే ఇమిడి ఉంది. మనకు సుషుప్తిలో ఇదే జరుగుతుంది కాని దాన్ని గమనించటం లేదు. అది ప్రకృతిలో సహజంగా ఒకవేళ ప్రకారం జరిగిపోతుంది కాని దాన్ని సాధకుడు తన అవసరం కోసం ధ్యాన యోగ మూలంగా స్వాధీనపరచుకోవలసి ఉంది.

ఈ ముద్రలో మొదట చంద్రబింబం వంటి కాంతి, దాని తరువాత ఇంద్రధనువు, పండువెన్నెల, నవరత్నాల కళలు, దీపాల వెలుగు, మెరుపు తీగలు,

సూర్యకాంతి, చిక్కని వెలుగు, దీపావళి మతాబాలు కాల్చినట్లు పొగ, మిణుగుర్లు కలిసి క్రమ్మినట్లయి ఆ తరువాత సూర్యకిరణ కాంతి ప్రవేశిస్తుంది. ఆవెలుగులో నదులు, పర్వతాలు, మునులు, దేవతలు ఇంకా వివిధమైన మాయా దృశ్యాలన్నీ కనిపించి లీనమైపోయి చివరకు ఒక నిర్మలమైన వెలుగు పుడుతుంది. అపుడు సాధకుని యొక్క అహంకారమంతా దానిలో అణగిపోయి ప్రశాంతి గలిగి ద్వంద్వాలుడిగి తాను దానిలో లీనమై పోతాడు. ఇదే తారక లక్ష్యమనబడుతుంది.

ఈ దృశ్యమంతా సాధకునికి త్రికూటస్థలంపై కనబడుతుంది.

భగవద్గీతలో ఈ సృష్టిని గురించి **ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహు రవ్యయం** (15-1) అని చెప్పబడింది. అనగా ఈ సృష్టికి మూలం ఊర్ధ్వం అనగా పైలోకమైన స్వర్గంలో ఉంది. అక్కడి నుండి అది క్రిందికి వ్యాపించింది. కాబట్టి దీన్ని మనం పోల్చినపుడు వ్రేళ్ల పైకి, కొమ్మలు క్రిందికి ఉన్న చెట్టువలె కనిపిస్తుంది.

**సృష్టి లక్షణం :**

సూర్యోదయం అందరు చూస్తూనే ఉంటారు. అతని కిరణాలు మొదలెక్కడ ప్రసరిస్తవి? ఎత్తయిన ప్రదేశంపై ప్రసరించిన పిమ్మటనే నేలపైకి దిగివస్తవి. దేశంలో ఏదైనా ఒక బృహన్నిర్మాణం జరిగినపుడు దాని ప్లానెక్కడ రూపొందుతుంది! మొదట అది కేంద్రంలో రూపు దిద్దుకున్న తరువాతనే రాష్ట్రాలకు వచ్చి అక్కడినుండి నిర్మాణ స్థలాన్ని చేరుతుంది కాబట్టి మన సృష్టి నిర్మాణం కూడ అంతే. మొదట దీని ప్రణాళిక స్వర్గంలో ఏర్పడి అక్కడి నుండి భూలోకానికి విస్తరిస్తుంది. అందుకే భగవద్గీత ఈ సంసారాన్ని ఊర్ధ్వమూల మధశ్శాఖం (15-1) సంసారమనే ఈ అశ్వత్థం యొక్క వేర్లు పైనున్నవి, కొమ్మలు క్రిందికి వ్యాపించినవి అని వర్ణించింది. దీన్నే దేశీ తాత్త్వికులు మొనలు మీదుగ కొనలు క్రిందుగ మొనసియున్నది వృక్షము అని



పాడినారు.[1] కనుక ఈ కవి అదే పద్ధతి ననుసరించి సాంఖ్యంలో యిందులో మొదట పరబ్రహ్మ తత్త్వాన్ని తెలిపి ఆపిమ్మట అతనినుండి సృష్టి అధోముఖంగా ఎట్లా విస్తరించిందో వివరించినాడు. అది ఈవిధంగా ఉంది.

మొదట అనగా ఈ సృష్టి కంటె పూర్వం పరచిదాత్ముడు (విశ్వకర్మ) ఒక్కడే ఉన్నాడు. అతని నుండి ఆకాశం, దాని నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలం, జలం నుండి భూమి పుట్టినవి. అనంతరం ఈభూమియే స్థావర జంగమాల కన్నిటి కాధారమయింది అని యిక్కడ పంచభూతాల వివరం తెలిపినాడు. అది ఈ ప్రకారంగా ఉంది.



1 ఈ ఊర్ధ్వమూలం అధశ్శాఖం మీకు అర్థం కావలెనంటె ఎపుడైనా నదీతీరంలోని వృక్షాన్ని ఇవతలి వైపు నిలచి నదిలో దాని ప్రతిబింబాన్ని చూడండి. కేలండర్లపై గూడ అపుడపుడిటువంటి దృశ్యాలుంటవి.

## పంచభూతాల వివరాలు

| పేరు | రంగు | మాతృక | శక్తి | పీఠం | అధిపతి | ఇంద్రియం |
|---|---|---|---|---|---|---|
| భూమి | ఎఱుపు | లకారం | క్రియా | త్రికూటం | బ్రహ్మ | అహంకారం |
| నీరు | తెలుపు | వకారం | జ్ఞాన | శ్రీహరి | విష్ణువు | చిత్తం |
| అగ్ని | నలుపు | రకారం | ఇచ్ఛా | గోల్లాటి విభువం | రుద్రుడు | బుద్ధి |
| వాయువు | నీలం | యకారం | ఆది | ఔటం | ఈశానుడు | మనస్సు |
| ఆకాశం | పసుపు | సకారం | పరా | బ్రహ్మరంధ్రం | సదాశివుడు | అంతరంగం |

ఈ పంచభూత వివరాల పిమ్మట మహావాక్యాలను వివరిస్తు వానికి మొదట దేహత్రయ వివరం చెప్పినాడు. అది యిట్లా ఉంది.

## జీవుని తనువులు

| తనువు | పేరు | గుణం | వర్ణం | అవస్థ | స్థానం | మాతృక |
|---|---|---|---|---|---|---|
| స్థూలం | విశ్వుడు | రజస్సు | ఎఱుపు | జాగ్రత | నేత్రం | అకారం |
| సూక్ష్మం | తైజసుడు | సత్వం | తెలుపు | స్వప్నం | కంఠం | ఉకారం |
| కారణం | ప్రాజ్ఞుడు | తమస్సు | నీలం | సుషుప్తి | హృదయం | మకారం |
| తురీయం | జీవుడు | శు. సాత్వికం | పసుపు | తురీయం | మూర్ధు | ఓంకారం |

## అభిమాని / ఈశ్వరుని తనువులు

| తనువు | పేరు | గుణం | వర్ణం | అవస్థ | స్థానం | మాతృక | అధిపతి |
|---|---|---|---|---|---|---|---|
| స్థూలం | విరాట్టు | రాజసాహంకారం | ఎఱుపు | ఉత్పత్తి | సూర్యమండలం | అకారం | బ్రహ్మ |
| సూక్ష్మం | హిరణ్యగర్భ | సాత్వికాహంకారం | ఖర్జూరం | స్థితి | చంద్రమండలం | ఉకారం | విష్ణువు |
| కారణం | అవ్యాకృతి | తామసాహంకారం | శ్యామం | ప్రళయం | అగ్నిమండలం | మకారం | రుద్రుడు |
| తురీయం | స్వరాట్టు | శుద్ధ సాత్వికం | ఛాయ | సాక్షిత్వం | అర్థచంద్రమండలం | ఓంకారం | లక్ష్మీపతి |



## అష్ట తనువుల వివరం

| | | | | |
|---|---|---|---|---|
| దేహత్రయము | స్థూలము (జీవాత్మ) | సూక్ష్మము (అంతరాత్మ) | కారణము (పరమాత్మ) | తురీయము (పరబ్రహ్మ) |
| ఆత్మాత్రయము | విశ్వుడు | తైజసుడు | ప్రాజ్ఞుడు | జీవుడు |
| అవస్థాత్రయము | జాగ్రత | స్వప్నం | సుషుప్తి | సమాధి |
| స్థానత్రయము | నేత్రము | కంఠము | హృదయం | సహస్రారం |
| అభిమానత్రయము | విరాట్టు | హిరణ్యగర్భము | అవ్యాకృత | స్వరాట్టు |
| గుణత్రయము | రాజసము | సాత్వికము | తామసము | శుద్ధ సాత్వికం |
| వర్ణత్రయము | రక్తవర్ణం | శ్వేతవర్ణం | నీలవర్ణం | శ్యామం |
| దైవత్రయము | బ్రహ్మ | విష్ణువు | రుద్రుడు | లక్ష్మీపతి |
| మాతృకాత్రయము | అకారము | ఉకారము | మకారము | ఓంకారం |

జీవుని శరీరాలు నాలుగు. ఈశ్వరుని శరీరాలు నాలుగు. ఈ మొత్తం కలిసి అష్టతనువులనబడుతవి. హనుమంతుడు శ్రీరామునితో

శ్లో॥ **దేహబుద్ధ్యాస్మి దాసోహం జీవబుద్ధ్యాత్వదంశకః**
**ఆత్మబుద్ధ్యా త్వమైవాహం ఇతిమే నిశ్చితామతిః**

ఓ స్వామీ! నేను దేహబుద్ధితో ఉన్నపుడు అనగా జీవమాత్రుడినే అనుకున్నపుడు మీకు దాసునిగా, జీవుడు గూడ ఈశ్వరాంశనే కదా అనుకున్నపుడు నేను మీయంశగా అనగా నేనుగూడ ఈశ్వరునే అని, ఈరెండు గాక నేను ఆత్మనే అనుకున్నపుడు శ్రీరాముడు పరబ్రహ్మమూర్తి కనుక నేను మీవలెనే పరబ్రహ్మనే అని అనుకుంటానని అంటాడు. కాబట్టి ఈనాటి జీవుడు గూడ పై మూడు స్థితుల్లో ఏదో ఒక స్థితిలో అనగా జీవునిగానో, ఈశ్వరునిగానో, బ్రహ్మగానో ఉంటాడు. అయితే

అతడు జీవుడుగా ఉన్నా ఈశ్వరుడు అనగా సగుణ బ్రహ్మగా ఉన్నా పైన కనబరచిన శరీర చతుష్టయం తప్పవు. అచలులు తమను "అష్టతను నిరసన" అనగా ఎనిమిది శరీరాలుగూడ విడిచిన వారమని చెప్పుకుంటారు. కాబట్టి వారు జీవులుగాని, ఈశ్వరులుగాని కానపుడిక ఒక బ్రహ్మ క్రిందనే లెక్క. ఇది **అహం** బ్రహ్మాస్మి అనే మహా వాక్యానికి నిదర్శన రూపం అనవలసి ఉంటుంది.

శంకరాచార్యుని యొక్క నిర్వాణషట్కం అనే "మనోబుద్ధ్యహంకార చిత్తాని సాహం" భుజంగ ప్రయాతంపై అష్టతను నిరసననే తెలుపుతుంది కాబట్టి అష్టతను నిరసన అనగా పాము కుబుసం విడిచినట్లు వారు స్థూల సూక్ష్మ కారణ తురీయ శరీర సంబంధాలన్ని విడిచి నిలిచినవారని అర్థం.

## మహావాక్యాలు

ఇవి వేదవాక్యాలు, ఉపనిషద్వాక్యాలని రెండు విధాలుగా ఉన్నవి. వేద వాక్యాలు ఆత్మను గురించి తెలుపగా తక్కినవి దేహాన్ని గురించి తెలుపుతున్నవి. వేదవాక్యాలు నాలుగు.



1. **ప్రజ్ఞానం బ్రహ్మ** - ఋగ్వేదం - ఐతరీయోపనిషత్
2. **అహం బ్రహ్మాస్మి** - యజుర్వేదం - బృహదారణ్యకమ్
3. **తత్వమసి** - సామవేదం - ఛాంద్యోగోపనిషత్తు
4. **అయమాత్మా బ్రహ్మ** - అధర్వ వేదం - మాండుక్యోపనిషత్తు

ఈ వేదవాక్యాలు బ్రహ్మజిజ్ఞాసతో ప్రారంభమౌతవి.

పూర్వం భృగు మహర్షి తన తండ్రియైన వరుణుని దగ్గరకేగి తనకు బ్రహ్మ విద్య బోధించమనగా ఆయన సృష్టిలో సమస్త ప్రాణులు అన్నం చేతనే పుట్టి పెరుగుతున్నవి కనుక అన్నమే పరబ్రహ్మమని చెప్పినాడు. భృగువది విని సమస్త జీవులన్నంచేతనే పుట్టి పెరుగుతున్నా అన్నం భూమి నుండి ఉత్పన్నమౌతుంది కనుక అదెట్లా పరబ్రహ్మమనగా రెండవసారి ప్రాణం పరబ్రహ్మమని చెప్పినాడు.

అదివిని ప్రాణం పంచీకరణంలో వాయ్వంశచేత ఏర్పడింది. ఇది దేహంలో ఒకటి కాబట్టి దేహంతో పాటే నశిస్తుంది. కనుక ఇదెట్లా బ్రహ్మమనగా మూడవసారి సర్వేంద్రియాణాం నయనం ప్రధానం. జీవుడీ జగత్తునంతా నేత్రంతోనే చూస్తున్నాడు కనుక అక్షియే పరబ్రహ్మం అని చెప్పినాడు.

జీవుడక్షితో చూస్తున్నా అది జడం, దాని వెనుక ఒక ఇంద్రియాధిపతి లేకుంటే పని చేయదు కనుక అదెట్లా పరబ్రహ్మమని అన్నాడు. అట్లాగే ఈ మహావాక్యాలు

ప్రజ్ఞానం బ్రహ్మ అనే దానితో ప్రారంభమైనవి. జ్ఞానం బ్రహ్మ స్వరూపమే అయినా అది త్రికాలా బాధ్యం కాదు. అన్ని జీవులలో ఒకేతీరుగా ఉండదు కనుక అది పరబ్రహ్మమెట్లనగా అయమాత్మా బ్రహ్మ - నీలోపల ఉండే ఆత్మ పదార్థమేదైతే ఉందో అదియే పరబ్రహ్మం అని చెప్పినాడు. ఈ ఆత్మను గురించి గీతలో

శ్లో॥ అచ్ఛేద్యోయ మదాహ్యోయ మక్లేద్యో శోష్య ఏవచ
నిత్యం సర్వగత స్థాణు రచలోయం సనాతన: ॥

అని చెప్పబడింది కనుక సాధకునికి ఈ ఆత్మనే పరబ్రహ్మమని నిశ్చయం కాగా అపుడాచార్యుడు "తత్వమసి" (తత్+త్వం-అసి) నాయనా! నీవు నేను జీవమాత్రుడనని భ్రమ పడుతున్నావు కాని జీవమాత్రుడవు కావు. నీవా ఆత్మ స్వరూపుడవే అనగా పరబ్రహ్మ స్వరూపుడవే అని తెలిపినాడు. అది విన్న తరువాత శిష్యుడా మాటను బాగా పరామర్శించి చూచుకోగా అపుడతనికి "అహం బ్రహ్మాస్మి" నిజమే నేను జీవమాత్రుడను కాను బ్రహ్మ స్వరూపుడనే అని ధృఢమయింది. ఆవిధంగా తాను బ్రహ్మ స్వరూపమని ధృఢపడిన పిమ్మట అతనికి "సర్వం ఖల్విదం బ్రహ్మ" నేనొక్కనినే బ్రహ్మంగాదు ఈసృష్టి సమస్తం బ్రహ్మమయమే అని అతనికి బ్రహ్మ యొక్క విశ్వరూప దర్శనం జరుగుతుంది. ఇది వేద వాక్యాల సారాంశం.

ఇక తక్కిన రెండవ మహావాక్యాలను పరిశీలింతాం.

1. **అయం వ్యర్థం బాహ్యం కోపీన భవతి** - ద్వాదశి
ఇదంతా ఉత్త బట్టబయలే ఏమీ లేదు.

2. **స్వప్నే ప్రతీయ మానాని రూపాణి యథా తథా** - పంచదశి
కలలో కనిపించే శరీరాలేలాగో ఈ శరీరాలు కూడ అంతే.

3. **మూలాభావ మిదం జ్ఞాతం శరీరం కిమ్నాస్తి:** - అనంతోపనిషత్
ఆలోచించి చూచినట్లయితే ఈశరీరానికి బుడమేది లేదు.

అచల మతస్థులీ జన్మకు మూలమేది లేదంటారు. కాని ఎపుడైనా కారణం లేక ఏకార్యం జరుగదు. ప్రస్తుతం మన జన్మలకు కర్మ ఒక కారణంగా కనిపిస్తుంది కాని ఆది సృష్టిలో అది కనిపించదు.



చాందోగ్యంలో "**తదైక్షత బహుస్యాం ప్రజాయేతి**". సృష్టి ప్రారంభంలో విశ్వకర్మ నేనొక్కనినే ఒంటరిగా ఉండటం బాగుండదు కనుక అనేకమౌతా ననుకున్నాడని చెప్పబడింది. దీన్ని పురాణాలు ఈశ్వరుడు లీలార్థమై ఈజగత్తు నంతా రచించినాడని చెప్పినవి. కనుక ఈసృష్టిని మొదట మాయ రచించని మాధవుడు రచించని ఆతొలినాటి జీవులు మాత్రం కర్మవశంగా పుట్టినవి కావనేది స్పష్టం.

భాగవతంలోని పురంజనోపాఖ్యానంలో అతడు మొదట లీలార్థంగానే ఒక పురాన్ని వెదకుతు వచ్చి ఒకచోట ప్రమదోత్తమ అనే యువతిని చూసి ఆమె మోహంలో పడి సంసారం చేసి దాన్ని తనపై ఆరోపించుకున్నందులకు మరుజన్మలో విదర్భరాజుకు పుత్రికయై జన్మించి పాండ్యరాజుకు భార్యయైనాడు. కాబట్టి ఆది సృష్టిలోని జీవులెవరకి కర్మ మూలమైన జన్మలేదని వారు నేను నాదియని గిరగీసికున్న తరువాతనే ఈ కర్మ యేర్పడి వారి పునర్జన్మలకు కారణమయిందని అనవచ్చు.

సృష్టికి కారణమేమిటి అనేదానికి మనవారు ప్రకృతి పురుష సంయోగం కారణమనగా శాస్త్రజ్ఞులు ప్రాణి పదార్థాల సమ్మేళనం కారణమంటారు.

విశ్వంలో ఈప్రాణికిగాని పదార్థానికిగాని నాశనమేనది లేదు. ప్రకృతిలో స్త్రీ పురుషుల సంయోగంతో స్త్రీ గర్భంలో దేహాలేర్పడుతున్నవి. జీవులు తమ కర్మ వశంగా వచ్చి వానిలో ప్రవేశిస్తున్నారు. ఆ దేహం పంచత్వమందిననాడు జీవుడు మరో దేహాన్ని వెదుక్కుంటు పోతున్నాడు. పంచత్వమందిన దేహం భూమిలో జీర్ణించి అన్నరూపమై మరో క్రొత్త దేహానికి కారణమవుతుంది కాని అదే దేహం అదే జీవుడు మాత్రం మళ్లీ ఒకచోట కూడరు.

లోకంలో ఈనాడనేకమైన జంతువులున్నవి గదా! వానికి గూడ కర్మ ఉందా! మనుష్యుని వలె వానికి జ్ఞానం లేదు కాబట్టి వానికి జన్మచక్రంలో పురోగతియే గాని తిరోగమనం లేదు. విశ్వంలో ఏజీవుడైనా ముక్తిని

పొందవలెనంటె అతడు మొదట దేవతా రూపాన్ని పొందవలె. అందువల్ల జంతువులు ప్రకృతి ననుభవిస్తు ఒక్కొక్క మెట్టెక్కి మానవదేహంలోనికి వస్తున్నవి. అంటే అవి దేవతా రూపాన్ని పొందినవన్నమాట. ఈ రూపం నుండి అవిక నేరుగా పరమపదానికి నిత్యవిభూతిలోనికి వెళ్లవలె కాని ఏ జన్మకు లేని జ్ఞాన వికాసమతనికీ జన్మలో లభించగా దానితో అతడు సమస్త కర్మల యొక్క కర్తృత్వాన్ని హోదా కొరకు తనపైననే ఆరోపించుకొని ఇదంతా నేనే సాధించినానని గర్వపడుతున్నాడు. దానితో అతనిని పరమపద సోపానంలో పెద్దపాము మ్రింగక తప్పటం లేదు. దీనికంతా మూలమేమిటి తనకు లభించిన జ్ఞానం తన్మూలకమైన వివిధ విషయకమైన పరిజ్ఞానం. తన జందెమే తన బంధమయిందని ఒక సామెత ఉంది. అట్లాగే మానవ జన్మలో జీవునికి తనయొక్క జ్ఞానమే తనకు ప్రతిబంధకమౌతుంది. అందుచేత గురువులు కావలసిందీ శాస్త్రజ్ఞానం కాదు. దీని బదులు తీవ్రమైన వైరాగ్యం కావలెననగా అచలులేమో ఈవిద్యలకుగాని ఈసృష్టికిగాని మూలమంతా "ఎఱుక" కనుక దాన్ని విడువవలెనంటారు. అంటే తీవ్రమైన వైరాగ్యమన్నా, ఎఱుక విడువటమన్నా వేర్వేరుగా కనిపించినా పరిణామంలో మాత్రం రెండు ఒకటే.

అచల మతస్థులు ఎఱుకతో పరబ్రహ్మాన్నెరిగిన పిమ్మట ఇకదానితో పనిలేదు. ఉండేనా అది నిన్ను మళ్లీ వెనక్కు లాక్కునిపోతుంది. కనుక దాన్ని విడువవలెనంటారు. ఇదే విషయాన్ని తిక్కయ్యగారు తన తత్వాలలో

ఎడ్డె గావలెరా! ఎడ్డె గావలెరా!
గడ్డిదినే పశువు రీతి దిడ్డి జేరవలెరా! - అని చెప్పినాడు.

సాధకునికి శాస్త్ర పరిశ్రమ చేసి పరబ్రహ్మ తత్వాన్ని తెలిసికోవటమెంత కష్టమో ఎఱుకను విడవటం అంతకంటె గూడ కష్టం కనుక నిజమైన గురువు యొక్క సామర్థ్యమంతా శిష్యునికీ ఎఱుకను విడిపించటంలోనే ఉంది.

ఇవి గురు మతస్థుల యొక్క మహావాక్యాలు. వీనికి మహావాక్య త్రయమని పేరు. ఇవి వారికి త్రిరత్నాలు. పరబ్రహ్మ తత్వం తెలిసినవారికి



ఇదుత్త బట్టబయలేమియు లేదు - ద్వాదశి

కలలో దోచిన శరీరా లేలాగో ఆలాగే - పంచదశి

మూలం లేని ఈ శరీరం గుర్తెరిగితేమిలేదు - షోడశి

అనేవానిని బట్టి విచారించినపుడు బ్రహ్మ సత్యం జగన్మిథ్య అనేదే వీని సారాంశంగా ఉంది. పై మహావాక్యాలలో మొదటి వాని వల్ల తానెవరనేది తెలుస్తుంది కనుక అతడెక్కడున్నాడు ఏం చేస్తున్నాడనేది తెలియవలె. దీన్ని గురించి కఠోపనిషత్తు -

**శ్రు॥ అంగుష్ఠ మాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి**
**ఈశానో భూత భవ్యస్య నతోవిజి గుప్సతే. ఏత ద్వైతత్ 4-12**

తా॥ ఈ శరీరం నడుమ బొటనవ్రేలి ప్రమాణం గల పురుషుడున్నాడు. అతడు భూత భవిష్య ద్వర్తమానాల కధిపతి. అతని కెవరి భయం లేదు. అతడే ఆత్మ.

**శ్రు॥ అంగుష్ఠ మాత్రః పురుషో జ్యోతిరివా ధూమకః** 4-13

ఆ అంగుష్ఠమాత్రుడైన పురుషుడు పొగలేని అగ్నివలె ఉన్నాడు అని చెప్పబడింది.

**"పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధో ముఖం । అధోనిష్ఠా వితస్త్యాంతే నాభ్యా ముపరితిష్ఠతి - జ్వాలమాలా కులంభాతి విశ్వస్యా యతనం మహత్. తస్యా శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః"**

మన శరీరంలో నాభికి పైన తామరమొగ్గ వలె హృదయకోశం వ్రేలాడుతుంది. దానిలో మంటల వరుస వలె ఒక వెలుగుంది. ఆ వెలుగు నడుమ ఒక పురుషుడున్నాడు. అతడే పరమాత్మ అని మంత్రపుష్పంలో చెప్పబడింది.

ముండకోపనిషత్తులోని "ద్వాసుపర్ణా సయుజా సఖాయా" అనే శ్రుతి వల్ల ఈ శరీరమనే వృక్షాన్నాశ్రయించి జతగా పుట్టి స్నేహంగా ఉండే రెండు పక్షు లాశ్రయించి ఉన్నవి అనేదాన్ని బట్టి దీనిలో ఒకేతీరు వారిద్దరున్నారని తెలుస్తుంది. అందులో ఒకరు పైన చెప్పబడిన పరమాత్మ అతనికే పురుషుడని, ఈశ్వరుడని పేర్లు. రెండవవాడు జీవుడు.

పరమాత్మకి శరీరంలో నికరమైన ఒక స్థానముండగా జీవునికి మాత్రమది లేదు. అతడు ఒక్కొక్క అవస్థలో ఒకచోట ఉంటాడు.

జాగ్రదావస్థలో భ్రూమధ్యంలో ఉండి ఈశరీరంలోని జ్ఞానేంద్రియ పంచకం, కర్మేంద్రియ పంచకం, ప్రాణ పంచకం, అంతఃకరణ చతుష్టయం అనే 19 తత్వాలతో పని తీసికుంటు ఉంటాడు. ఈ 19 తత్వాలు గల శరీరానికి అన్నమయ కోశమని పేరు. ఇపుడితనిని విశ్వుడంటారు.

స్వప్నావస్థలో అతడు కంఠస్థానంలో ఉండి జ్ఞానేంద్రియ పంచకం, పంచతన్మాత్రలు, ప్రాణ పంచకం, మనోబుద్ధులు అనే 17 తత్వాలతో పని తీసికుంటాడు. ఈ 17 తత్వాల శరీరానికి మనోమయ కోశమని పేరు. ఇపుడితని పేరు తైజసుడు.

---

గండికోట సచ్చిదానంద స్వామి వారు తమ జీవబ్రహ్మైక్య రహస్యం అనే గ్రంథంలో ఈ హృదయకోశం యొక్క ఫోటోను చూపి, హృదయాన్ని రెండు భాగాలుగా కోసి చూపినారు. దానిలో ఒక రంధ్రం, ఆ రంధ్రంలో టెంకాయ పాల వంటి నీరు, ఆ నీటిలోనే ప్రకాశించే జ్యోతి ఉంటుందట. ఇది నీటిలోని జ్యోతి కనుక ఆపోజ్యోతి అనబడుతుంది. ఆపస్ అనగా నీరు.

అగ్నికి నీటిపాప అనగా నీటిలో పుట్టిందని పేరు. సృష్టి తత్వంలో మాత్రం అగ్ని నుండి నీరు పుట్టినట్లు చెప్పబడుతుంది. ఇది అగ్నికి నీటికి ఉండే సంబంధం. ఈ రెండే మానవునిలో ప్రాణం మరియు జీవుడుగా ఉన్నవి. అనగా నీరు ప్రాణం, అగ్ని జీవుడు. ఆ రెండు ఒకదాన్ని విడిచి ఒకటి ఉండలేవు. ఒకటి పోతే రెండవది గూడ దాని వెంటనే వెళ్లుతుంది.



సుషుప్తిలో అతడు జ్ఞానేంద్రియ పంచకం, తన్మాత్ర పంచకం అనేవిగూడ విడిచిపెట్టి ఒక్క బుద్ధిని మాత్రమే వెంట ఉంచుకొని హృదయస్థానంలోనికి వెళ్లుతాడు. ఈ శరీరం విజ్ఞానమయ కోశమనబడుతుంది. ఇపుడితనికి ప్రాజ్ఞుడని పేరు.

తురీయమనేది సుషుప్తికంటె అతీతమైన అవస్థ. జాగ్రతలో జీవునికి బహిఃప్రజ్ఞ ఉంటే స్వప్నంలో అంతఃప్రజ్ఞ సుషుప్తిలో ప్రజ్ఞాన ఘనత్వం ఉండగా ఈతురీయదశలో అవేవి ఉండవు. ఇది ఆనందమయ కోశమనబడుతుంది. కాని ఈశరీరంలోనికి యోగులు తప్ప యితరులు ప్రవేశించలేరు.

ఈవిధంగా జీవుడు తన నిత్య జీవితంలో మరణ పర్యంతం ఎపుడు ఏదో ఒక దేహాన్ని అనుభవిస్తూనే ఉంటాడు. తురీయాన్ని గూడ అనుభవించక పోడు గాని ఆక్షణాలతనికి తెలియకుండానే గడిచిపోతుంటవి.

జీవుడు జాగ్రదావస్థలో భృకుటి స్థానంలో ఉంటాడు. ఈ దేహంలోని పురుషుడు పొగలేని అగ్నివలె ఉంటాడు కనుక జీవుడు గూడ అట్టివాడే కాబట్టి అందుచేత అతని చిహ్నంగా హిందువులకెపుడు భృకుటి స్థానంలో ఎఱుపు రంగు గల కుంకుమ ధరించే ఆచారమేర్పరచబడింది.

పురుషుడు బొటనవ్రేలి ప్రమాణంగా ఉంటాడని చెప్పబడింది. తల్లి కడుపులో పిండమేర్పడినపుడు గూడ మొదట అది బొటనవ్రేలంత మాంసపేశిగనే ఆరంభమవుతుందట. అందుకే పితృదేవతలకు తర్పణాలు విడిచే అపుడు బొటనవ్రేలుపయోగింప బడుతుంది. మానవునికి మరణించే ముందు మొదట బొటనవ్రేలే చచ్చుబడిపోతుంది.

స్వప్నావస్థలో అతడు కంఠదేశంలో ఉంటాడు. అది జనలోకం కనుక అతడపుడీ ప్రపంచంలోని వింతలన్ని తిలకిస్తాడు.

సుషుప్తిలో హృదయంలో ప్రవేశిస్తాడు. అది పరమాత్మ స్థానం. అతనికది బిడ్డకు తల్లివడి వంటిది. తల్లి చంకన ఉన్నంతసేపు బిడ్డకే భయంగాని, చింతగాని ఉండవు. ఏ ఆటవస్తువు అవసరం కూడ ఉండదు. కనుక జీవునికిది అటువంటి స్థితియే. అందువల్ల అపుడతడు ప్రపంచమేది పట్టకుండ తనలో తానే ఆనందంగా ఉంటాడు.

అయితే అతడు హృదయ స్థానంలో ఉన్నంతసేపు పురుషునిలో లీనమవుతాడో లేదా అతని ప్రక్కన ఉంటాడో, వడిలో ఉంటాడో తెలియదు.

అతడట్లా దినదిన మొకసారి ఈశ్వరుని దగ్గరకు వెళ్లి ఆనందంలో మునిగితేనే తప్ప అంటే కమ్మని గాఢనిద్ర అనుభవిస్తేనే తప్ప అతనిలో మరునాడు నూతన చైతన్యం వెల్లివిరియదు. లేకుంటే దివాలు చెడియే ఉంటాడు.

ఇట్లా జీవునితో పాటు ఈదేహంలో ఉన్న పురుషునికి గూడ నాలుగవస్థలున్నవి. ఆ అవస్థల్లో అతడు విరాట్టు, హిరణ్యగర్భుడు, అవ్యాకృతుడు, స్వరాట్టు అని అనబడతాడు.

మహావాక్యాలలో తత్వమసి అనేది చరమ వాక్యం. దీనికి అదే నీవు లేదా అతడే నీవని అర్థం. ఇంతవరకు వరుణుడు భృగువుకు పరబ్రహ్మ స్వరూపం చెప్పిన సందర్భంలో ఈ "తత్వమసి" అనేది వివరింపబడింది. జీవుడీ దేహంలో ఉన్నంతకాలం ఈ తత్వమసినే సోఽహం సోఽహం - సఃఅహం - అతడే నేను, అతడే నేనని తదేకంగా జపిస్తు హంస రూపంలో దీనిలోని షట్చక్రాలలో ఉన్న దేవతలందరిని సేవిస్తుంటాడు కనుక దాని ఫలితంగానే సుషుప్తి వేళలో అతడా పురుషుని జేరి ఆనందాన్ననుభవిస్తాడు. కాబట్టి యిది యెఱిగి ప్రాజ్ఞుడైన తాను గూడ అజపగాయత్రియైన



సోఽహాన్ని గమనిస్తు జపగాయత్రిగా చేసికుంటే అనగా ఆనిశ్చయంలో నిలిస్తే అతనికింక ఢోకా ఉండదు.[1]

ఇందుకు దీనిలో తత్వమసి క్రింద మూడు మార్గాలు చెప్పబడినవి. వానిలో మొదటిది స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు మరియు పురుషుని యొక్క విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతాలు త్వంపదంలోనివేనని వానిని నిషేధించి తురీయం తత్పదమని తెలిసికుని ఈ అష్ట తనువుల నడుమ అఖండంగా వెలిగే జ్యోతి ఏదైతే ఉందో అదే నేనని నిశ్చయించుకోవటం.

రెండవ పద్ధతిలో జీవ వర్ణాలైన మొదటి మూడు దేహాలు శివుని యొక్క స్థూల దేహాలని, తురీయం అతని లింగతనువని జ్యోతియొక్క తటిత్కాంతి అతని నావరించిన కారణాంశమని దానిలోని శిఖ ఈశ్వరుని తృతీయ దేహం కనుక ఇదంతా త్వంపద వాచ్యంలోనిదేనని నిషేధించి మిగిలిన నిర్గుణం నిరవయవమైన "పర ఎఱుకే నేనని" అనగా నేనైతినని తెలిసికోవటం.

మూడవ పద్ధతిలో బిందువు త్వంపదం, దానిలోపలి కళ తత్పదం. అందలి పురుషుడే "అసి" అనగా నేనని నిశ్చయించుకోవటం. ఇవి తత్వమసి అనే దాని తాత్పర్యాలని అన్నాడు. ఎవరీ నిశ్చయంపై నిలుస్తారో వారు ఘటం పగిలిపోగా దానిలోని ఆకాశం మహాకాశంలో కలిసినట్లు ఈ స్థూలదేహం పంచత్వమందగా సూక్ష్మదేహ కారణదేహాలు లుప్తమైపోయి అతడు వెంటనే పరబ్రహ్మంలో చేరిపోతాడు. అతనికి సగుణ మార్గోపాసకుల వలె అభౌతిక

[1] సోహం అనేది అహం సః అదే నేను అనేదాని వ్యత్యస్త రూపం. సం:+అహం సంధిలో సోఽహం అవుతుంది. గాయత్రి అనగా తనను గానం చేసేవారిని రక్షించేదని అర్థం. ఇది జీవుని జనన మరణావస్థల నుండి రక్షిస్తుంది కాబట్టి గాయత్రి అనబడింది. సోఽహం యొక్క మరో రూపమే ప్రణవమనబడే ఓంకారం. ఇది పరబ్రహ్మ వాచకం. సోఽహం అనగా అదే నేను అనుకుంటే ఓంకారం అదే నేనుగాదు తానే పరబ్రహ్మం అవుతుంది. అందుచేతనే గీతలో ఓంకార జపంతో దేహాన్ని విడిచే వాడు నేరుగా నన్నే చేరుతాడని శ్రీకృష్ణ భగవానుడు సెలవిచ్చినాడు.

లోకాలలోని ఒక్కొక్క మండలంలో ఒక తత్వాన్ని విడిచి పెట్టుకుంటు పరమపదాన్ని చేరవలసిన అవసరముండదు. ఇది అచల మార్గస్థుల నిర్ణయం.

ఇంతవరకు జీవేశ్వరులను గురించి కొన్ని మతాలు జీవుడీశ్వరుని ప్రతిబింబమని, మరికొన్ని మతాలు యిద్దరు పూర్తిగా భిన్నులని చెప్పినవి.

ఇట్లాగే ముక్తి విషయంలో జీవుడు ఈశ్వరుని లోకంలో ఉంటాడని కొన్ని, జీవుడీశ్వరుని రూపాన్ని పొందుతాడని కొన్ని, ఈశ్వరునిలో ఐక్యమై పోతాడని కొన్ని మతాలు మూడు విధాలుగా చెబుతున్నవి.

ఇంతవరకనేక జన్మలు గడిచి పరిణామ దశకు చేరిన మానవుడెవరు అనేదానికి మతాలు చాలావరకతడు జీవుడే అని నిర్ణయించి కొన్ని సంస్కారాల చేత అతడు జీవధర్మాన్ని విడిచి ఈశ్వరుడవుతాడనగా వీటన్నిటికి భిన్నంగా అచలం మాత్రం ఈమానవుని నీవు జీవమాత్రుడవు కానేకావు ఈశ్వరుడవే అని ఖండితంగా చెబుతుంది. అయితే ఈశ్వరుడంటే వీరి దృష్టిలో సృష్టికర్త గాదు. అతడు బ్రహ్మవాచ్యుడు, సాక్షిమాత్రుడు. ఈ సృష్టినంతా మాయ అనే శక్తి రచిస్తుంది అని వారి మతం.

ఇతర మతాలు ప్రకృతి లేదా మాయ అనేదాన్ని వీరు "ఎఱుక" అని పిలుస్తారు. ఇది నిర్వికారం, నిశ్చలం అయిన బ్రహ్మంలో కాలవశంగా సముద్రంలో బుడగలు పుట్టి నశించినట్లు తెరపై బొమ్మవలె కొంతకాలం కనిపించి కొంతకాలం మళ్లీ అంతర్ధానమవుతుంది. కనిపించినపుడీ సృష్టినంతా విస్తరిస్తుంది. అంతర్ధాన సమయం రాగానే ప్రళయాన్ని సృష్టించి అంతా మళ్లీ తానే మ్రింగివేస్తుంది. దానికి కలకాలం ఇదే పని. అయితే అది ఎందుకట్లా పుడుతుంది. ఎందుకీ సృష్టినంతా చేస్తుంది అంటే దానికి కారణమంటు ఒకటి లేదు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు కోకిల ఎందుకు కూస్తుంది, గాలి ఎందుకు వీస్తుంది అని అన్నట్లు ఆ కోకిల కూతకుగాని, గాలి వీచటానికిగాని ఒక కారణం కనిపిస్తుందేమో కాని ఈ ఎఱుక పుట్టుకకు లయానికి మాత్రం అటువంటిదేది కనిపించదు.



ఇక సగుణ బ్రహ్మవాదుల ప్రకారంగా చూసినట్లయితే ఈ సృష్టినంతా బ్రహ్మో యో, విష్ణువో ఎవరో ఒకరు చేస్తున్నారు.

భాగవతంలోని ద్వితీయ స్కంధంలో నారదుడు బ్రహ్మను నీవెందు కొరకీ సృష్టి చేస్తున్నావు, దీనివల్ల నీకేం లాభమని ప్రపంచ ప్రకారమడిగితే, అతడు దీనివల్ల నాకేం లాభంలేదు, నారాయణుడు చేయమన్నాడు చేస్తున్నాను అంతేకాని ఎందుకో నాక్కూడ తెలియదనే అంటాడు. ఆయన ఆప్రకారంగా మెలకువ ఉన్నంతకాలం జగత్తును సృష్టించి చీకటి పడేవేళకు తన దుకాణమంతా కట్టిపెట్టి అనగా ప్రళయం చేసి నిద్రించి మేల్కొన్న తరువాత మళ్లీ యధాప్రకారంగా తన పనిలో లీనమవుతున్నాడు. ఇప్పటికాయనకు అరవై నిండిపోయినవి. అయినా దినదినం తన పని మాత్రం మానటం లేదు. ఈ సృష్టిని బ్రహ్మగాక స్వయంగా విష్ణువే చేసినా అంతే. ఆయనకు గూడ యోగనిద్ర ఉంది కనుక మెలకువగా ఉన్నంతకాలం లీలార్థం ఈ సృష్టి చేస్తాడు. నిద్రించే వేళకు అంతా మళ్లీ ఉపసంహరిస్తాడు.

బ్రహ్మ పరంగా ఆలోచించినా సృష్ట్యాదిలో ఒక్కడైన బ్రహ్మ తాను ఒంటరిగా ఉండలేక బహుస్యాం ప్రజాయేత తదైక్షత అని సంకల్పించి మాయతో కూడి అనేకమైనాడని శ్రుతి చెబుతుంది. కనుక ఇక్కడ ఈ శ్రుతులను విచారించినపుడు బ్రహ్మ ఈ సృష్టి భారాన్నంతా తనపై పెట్టుకోలేదు. నారాయణుడు చేయమన్నాడు కాబట్టి నేను చేస్తున్నానన్నాడు. అందువల్ల చివరి దశలో అనగా అతని ఆయుష్యం తీరగానే పునరావృత్తి రహితుడు అనగా మళ్లీ జన్మలేనివాడవుతున్నాడు.[1] ఇట్లా ఇప్పటి కార్గురు బ్రహ్మలు గతించినారట. ఇప్పటి ఆద్యబ్రహ్మ ఏడవవాడు.

చాందోగ్యం ప్రకారం ఆద్యసృష్టిలోని బ్రహ్మను చూసినా అతడు నేను పెక్కు కావలెననుకున్నాడు కాని తరువాత వారంతా నావారే అని సంసారంలో పడలేదు.

1 గీతలో శ్రీకృష్ణుడర్జునునికి చెప్పింది గూడ యిదే.

విష్ణువట్లా కాక తానీ లోకాన్నంతా లీలార్థమే సృజించినా ఈ జీవులందరూ నా బిడ్డలనుకున్నాడు కనుక వారి రక్షణ కోసం తనకు అవతారాల తిప్పలు తప్పలేదనిపిస్తుంది. అందువల్ల సంసారంలో జీవులెప్పుడైనా నిమిత్త మాత్రులుగానే ప్రవర్తించవలె గాని కర్తృత్వాన్ని తనపై ఆరోపించుకోరాదు. పునరావృత్తి రాహిత్యానికిది చాలా ముఖ్యమైన సూత్రం.

## నేత్ర వివరం



| అక్షి | అధిదేవతలు | భూతాలు | శక్తులు | అండత్రయం | మండలత్రయం | గంగలు |
|---|---|---|---|---|---|---|
| నేత్ర వలయం ఎఱుపు | బ్రహ్మ | పృధివి | క్రియాశక్తి | × | అగ్ని మండలం | × |
| తెల్లగుడ్డు తెలుపు | విష్ణువు | ఉదకం | జ్ఞానశక్తి | అండాండం | × | × |
| నల్లగుడ్డు నలుపు | రుద్రుడు | అగ్ని | ఇచ్ఛాశక్తి | పిండాండం | సూర్య మండలం | గంగ |
| బిందువు / పాప నీలం | ఇంద్రుడు | వాయువు | ఆదిశక్తి | బ్రహ్మాండం | చంద్ర మండలం | యమున |
| కళ సునీలం | సూర్యుడు | ఆకాశం | పరాశక్తి | ప్రపంచం | సకల ప్రపంచం | సరస్వతి |
| నిష్కళ | పరబ్రహ్మ | పరబ్రహ్మ | పరబ్రహ్మ | పరబ్రహ్మ | పరబ్రహ్మ | పరబ్రహ్మ |

## అక్షి పురుష వివరం

ఇందులో కన్ను తెల్లగుడ్డు చుట్టుండే ఎరుపు, తెల్లగుడ్డు, నల్లగుడ్డు, నల్లగుడ్డు లోపలి బిందువు, ఆ బిందువులోని కళ, దానిలోని సుషిరం అనే ఆరు భాగాలు చేసి వాని వివరం చెప్పబడింది. అది ఈ విధంగా ఉంది.



1. కంటి తెల్లగుడ్డు చుట్టుండే ఎఱ్ఱని జీర బ్రహ్మ. తెల్లగుడ్డు విష్ణువు. నల్లని గ్రుడ్డు రుద్రుడు. దానిలోని బిందువు ఇంద్రుడు, దానిలోని కళ సూర్యుడు. ఈ కళలోని నిష్కళయే పరబ్రహ్మ. అదియే తాను.

2. కంటి చుట్టుండే ఎఱ్ఱజీర భూమి. తెల్లగుడ్డు జలం. నల్లగుడ్డు అగ్ని. దానిలోపలి పాప వాయువు. పాప లోపలి కళ ఆకాశం. అందులోని సుషిరం అనగా బయలు అనగా నిష్కళయే తాను.

3. కంటిలోని ఎఱ్ఱజీర క్రియాశక్తి. తెల్లగుడ్డ జ్ఞానశక్తి. నల్లగుడ్డు ఇచ్ఛాశక్తి. పాప ఆదిశక్తి. దానిలోని కళ పరాశక్తి. ఆకళలోని నిష్కళయే తాను.

4. కంటిలోని తెల్లగుడ్డు అండాండం. నల్లగుడ్డు పిండాండం. పాప బ్రహ్మాండం. దానిలోని కళ ఈ ప్రపంచం. ఆకళలోని నిష్కళయే తాను.

5. కంటిలోని ఎఱ్ఱజీర అగ్నిమండలం. నల్లగుడ్డు సూర్య మండలం. బిందువు చంద్ర మండలం. అందులోని కళ ఈ సకల ప్రపంచం. దానిలోని నిష్కళయే తాను.

6. కంటిలోని నల్లగుడ్డు గంగ. దానిలోని బిందువు యమున. ఆ బిందువులోని కళ సరస్వతి. దానిలోని నిష్కళ తాను

అని తెలియవలె. ఈవరుసలో నిష్కళ అని చెప్పబడినదంతా పరబ్రహ్మ వాచకం. అచలం ఈజీవుని జీవుడని కాక పరబ్రహ్మమనియే చెబుతుంది. పరబ్రహ్మమనగా ఏనామ రూప గుణాలు లేని శుద్ధ సాత్విక రూపం. కనుక జీవుడు గూడ అట్టివాడే కాబట్టి అందువల్ల వారతనిని పరబ్రహ్మమనియే వ్యవహరించినారు. జీవుడీ పరబ్రహ్మ రూపాన్ని పొందటమే ముక్తి.

సాహిత్య మర్యాదలో ముక్తిని కాంతతో పోల్చటం ఒక సంప్రదాయం కాబట్టి ఈ నిష్కళనే పరబ్రహ్మమని ముక్తి కాంత అని గూడ అంటారు.

జీవుడు తానుగూడ నిష్కళం అయినపుడా ముక్తి కాంతతో ఉంటాడు. కనుక తనను తాను నేనా నిష్కళా రూపాన్నే అని గట్టిగా తెలిసికోవలె. ఈ విషయమే ఈ ఆత్మబోధలో ఒక భర్త తన యొక్క భార్యకు చెప్పినాడు.

## ఇందులోని శ్రుతి వాక్యాల వివరణ

శ్రు॥ **అజామేకం లోహిత శుక్ల కృష్ణాం**
**బహ్వీం ప్రజాం జనయంతి సరూపామ్**
**అజోహ్యేకో జుషమాణో నుశేతే**
**జహాస్యేనాం భుక్తా భోగామ యోన్యః**

తైత్తరీయారణ్యకం - ద్వితీయ ఖండం - దశమానువాకం 5వ ఋక్కు

అజ అనగా జననం/పుట్టుక లేనిదని అర్థం. ఇది పరబ్రహ్మ వాచకం. ఈనాడిది బ్రహ్మకు పర్యాయంగా వాడబడుతున్నా అతడు ప్రతికల్పంలో విష్ణువు యొక్క నాభి కమలం నుండి పుడుతూనే ఉన్నాడు. కనుక పై అజ అనే నామం పుట్టుకలేని విశ్వశృట్టుకే చెల్లుతుంది. అతని తరువాత చెప్పదగింది మాయ. దీన్నిపుడు మనం ప్రకృతి అంటున్నాం. అద్వైతుల సిద్ధాంత ప్రకారం బ్రహ్మం సాక్షిభూతం మాత్రమే. ఈసృష్టినంతా ఆబ్రహ్మంలో పుట్టిన త్రిగుణాత్మకమైన మాయనే రచిస్తుంది.

"అజ" అనబడిన ఈ మాయ ఎఱుపు-తెలుపు-నలుపు అనే మూడు రంగులతో కూడింది. ఈ మూడు రంగులు రాజసం, సత్వం, తామసం అనే గుణాలకు చిహ్నాలు. ఈ మూడు గుణాల నుండి అజ దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు అనే మూడు జాతులను సృష్టించిందని పై శ్రుతి యొక్క తాత్పర్యం.

పై శ్రుత్యర్థ ప్రకారం రాజసంతో మనుష్యులు, సాత్వికంతో దేవతలు, తామసంతో తిర్యక్కులు పుట్టినవని అర్థం.



మరొక పక్షంగా లోహిత శుక్ల కృష్ణ వర్ణాల నుండి సృష్టికర్తలైన బ్రహ్మ, విష్ణువు, శివుడు జన్మించినారని అర్థం. ఈ సృష్టికర్తలు పుట్టిన పిమ్మటనే బ్రహ్మ చేత దేవ మానవ తిర్యక్సృష్టి జరిగింది.

సామాన్యుని పరంగా ఈశ్రుతికి ఎఱుపు, తెలుపు, నలుపు రంగులు గల ఒక మేక తనవంటి రూపంగల అనేకమైన పిల్లలనీనింది అని అర్థం. దీనిలో పైరంగులను పిల్లల పరంగా చెప్పినపుడు అజ అనబడిన మేక ఎఱుపు, తెలుపు, నలుపు రంగులు గల మూడు పిల్లలకు జన్మనిచ్చిందని అర్థం. ఈవిధంగా ఈశ్రుతి వీరబ్రహ్మేంద్రయోగి వంటి మర్మకవిత్వానికి బీజంగా ఉంది.

పైశ్రుతిలోని ఉత్తరార్థం "అజోహ్యేకో జుషమాణో" అనే దళం నుండి ముండకోపనిషత్తులోని

శ్రు॥ **ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే**
**తయోరన్యం పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచాకశీతి**
అనే శ్రుతి పుట్టింది.

తా॥ బంగారు రెక్కలు గల రెండు పక్షులు జతగా పుట్టి స్నేహంతో ఉండి ఒకేచెట్టు నాశ్రయించినవి. వానిలో ఒకటి ఆపిప్పల వృక్షం యొక్క పండ్ల కాశించి పైకి క్రిందికి పరుగులు పెడుతుండగా మరొకటి దాన్ని సాక్షిమాత్రంగా చూస్తుంది అని పై శ్రుతి యొక్క తాత్పర్యం.

పై రెండు పక్షులలో పండ్ల కోసం క్రిందికి మీదికి పరుగులు పెట్టే పక్షి జీవుడు. సాక్షిమాత్రంగా ఉన్న పక్షి ఈశ్వరుడు అనబడుతున్నారు. ఈశ్రుతిని బట్టి జీవేశ్వరులిద్దరు "సయుజా సఖాయా" అనగా ఒకేసారి కలిసియే పుట్టి సఖులుగా ఉన్నారు. అనగా వారిద్దరు కూడ భిన్నులు మరియు సమాన స్థాయి కలవారని తెలుస్తుంది.

ఇందులోని రెండవ శ్రుతి

శ్రు॥ **ఋతగ్ం సత్యం పరం బ్రహ్మ పురుషమ్ కృష్ణ పింగళమ్**
**ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమో నమః**[1]

తైత్తరీయారణ్యకం - 10వ ప్రపాఠకం

తా॥ వైదిక ప్రకారం ఋతం సత్యం, పరబ్రహ్మ, పురాణ ప్రకారం ఊర్ధ్వరేతుడు విరూపాక్షుడు, విశ్వరూపుడు అనే పేర్లు గల పురుషునికి నమస్కారం. అతడు ఒకవైపు నలుపు, మరొకవైపు పసుపు వన్నెగా ఉన్నాడు.

ఈ పురుషునిలోని నలుపు భాగం పురుషుడుగా, పసుపు వన్నె భాగం స్త్రీగా చెప్పబడుతుంది. కనుక ఇతడు అర్ధనారీశ్వరుడని అర్థం.

సృష్టిలో మొట్టమొదటి జీవులిట్లా అర్ధనారీశ్వరంగానే అనగా స్త్రీపురుష భేదం లేకుండనే ఉభయలింగ జాతులుగనే ఉండేవని కాలక్రమంగా అవి శరీరాల యొక్క రూపురేఖలు సంపూర్ణంగా వికసించి స్త్రీ పురుష రూపాలు వేర్వేరైనవని సృష్టితత్వవేత్తలంటారు.[1]

ఇప్పుడు మనలో స్త్రీ పురుష హార్మోనులు రెండు ఉన్నవని ఒక దశ దాటిన పిమ్మట అనగా యవ్వనం దాటిన పిమ్మట స్త్రీ పురుషులలో వ్యతిరేక హార్మోనులు పుంజుకుండుండటం తొలినాటి అర్ధనారీశ్వరత్వానికే వారు ఆనవాలంటారు. కనుక ఇపుడు మనమారాధించే అర్ధనారీశ్వరుడతి ప్రాథమిక సృష్టికి సంకేతమైన దైవంగా భావించవలసి ఉంది.

ఇపుడు మనవారు పురుషునిలో ఎడమ భాగం స్త్రీ అని, స్త్రీలో కుడి భాగం పురుషుడనే వాడుక గూడ ఉంది. అంతేకాక పురుష శరీరంలో కుడి భాగం, స్త్రీ శరీరంలో ఎడమ భాగం ఎక్కువ బలంగా కూడా ఉంటాయంటారు.

1 ఇందుకు పై శ్రుతిలోని ఊర్ధ్వరేతుడు కామవికాసం లేనివాడు.

విరూపాక్షుడు = అక్షములంటే యింద్రియాలు కనుక జననాంగాది యింద్రియ వ్యవస్థ విరూపంగా అనగా యింకా చక్కగా లేనివాడు.

విశ్వరూపుడు = విశ్వంలోని మొదటి రూపం గలవాడు అని సంకేతంగా కూడ ఉన్నవా అనిపించక మానదు.



# ఆత్మైక బోధ - ద్విపద

- యోగానందావధూత స్వామి

## గురు స్తుతి

శ్రీమన్మహాభాగ్య శృంగారమగుచు
నామరూపంబుల నాటపట్టగుచు
భానుకోటి ప్రభా భాసితుండగుచు
నానాక్రియలకెల్ల నాధారమగుచు
వేదాంత శాస్త్రాల వివరింపబడుచు
నాదాంతమై లోక నాయకుండగుచు
భక్తజనుల కెల్ల బ్రహ్మరూపమగుచు
ముక్తిదాయకమయి ముక్కుతుదుండు (తుద+ఉండు)
ఆరుపూవులమధ్య నాయుదకమున
నాదమైకల సుధా నాదఘోషగుచు (ఘోష+అగుచు)
మేలుగాబలుకుచు మెలగియందున్న
శ్రీలింగ గురుని నా చిత్తంబునందు
భావించియాతని పలుమారు గలిసి
సావధానము బొంది సఖియరో నేను.

## అవతారిక

అతని యాజ్ఞ ధరించి యాత్మైక బోధ
వితతముగా లెస్స వివరింతు నీకు
వినుము శ్రీగురు జేరు విధము సద్గురుని
వినుతి జేయు విధంబు వివరింతు మరియు
ఆధ్యాత్మమును మరి నాది భౌతికము
ఆధి దైవికమును నంటజెప్పెదాను

అమరిన సాంఖ్యంబు నాతారకంబు
అమితాత్ముడుండేటి అనువైన తావు
పంచభూతంబుల ప్రక్రియలన్ని
సంచితంబుగదాని సంజ్ఞలన్నియును
పటుతర మహవాక్య ఫణితులు నాల్గు
విధములు లెస్సగా వివరింతు దెలియ
బుధజన సంతోష పూర్వకముగను
మరి చెప్పవలసిన మర్మంబులన్ని
పరికించి విషయంబు బహువిధంబులను
చెలియరో నీకు నే జెప్పెద సుమ్మి
పలు మాటలేల యీ బ్రహ్మానుభవము
నాలకించిన వార లాత్మస్వరూప
మూలముగనిదాన మోదమందెదరు



అటుగాన నీదేహపాశలు రోసి (దేహపు + ఆశలు)
పటువుగా గురుజేరు పద్దతి వినుము
ఇల్లు గాలుచునుండ నింట్లోని వారు
తల్లడంబుం బొంది తాబయల్వెడలి
యెటువలె వత్తురో వెలది నీవట్లు
దిటవైన తెంపుతో తిరిగి చూడకను
పదపడి సంకల్ప పద్దతి విడిచి

## గురు సేవా విధానం

సదమల గురు జేరి సద్భక్తి తోడ
అతని పాదములపై నతి ప్రీతిగాను
మతి నిల్పి సాష్టాంగ మమరదండంబు
పది రెండు మారులు బాగుగా జేసి
కదిసి యంగుష్టంబు కన్నులొత్తుచును
జయజయ గురురాయ జయమహాదేవ
జయ కారణాచార్య జయ మహాసింధు
దీనపోషకుడవు దీనబంధుడవు
దీనుల మొర విన దిక్కిక నీవె
భవ రోగముల మహా భయకంప మంది
కవిసి యింద్రియ బృంద కాంక్షల దగిలి
ఆశతృష్ణలచేత నాపదబొంది

పాశబంధములచే బాయగలేక
నీకు శరణమంటి నీ బంటునంటి
నాకు భర్తవు నీవె నాస్వామివికను
తల్లిదండ్రియు నీవె దాత దైవంబు
నెల్లబంధులు నీవె యేలిక నీవె
అనియిట్లు గురునకు నతిదైన్యముగను
మునుకొని యీరీతి మొరలిడు చెలియ
తను ప్రాణధనములు తాత్పర్య యుక్తి

మనసులో గూడంగ మరిధార బోసి
గురుని యాజ్ఞ దలంచి కొలిచి యుండినను
గురుదేవుడప్పుడు గురుకృపతోడ
సకల సంశయములు సంహరింపుచును
వికసిత లింగాంగ విభవ బిందువులో

అకలంకముగ నీదు అమర స్వరూపు
సుకరము గానీకు జూపెడు విధము
అఖిల మర్మంబులు అఖిలార్థములను
అఖిల మార్గంబులు అతివరో నీకు
ఆలింగ గురునాజ్ఞ నాత్మలో నుంచి
పాలించి లెస్సగా పలికెద వినవె



# జ్ఞానేంద్రియాలు - వాని అధిపతులు

ఎటువలె నంటెను ఎఱుక జెప్పెదను
కుటిల భావము మాని కూర్మితో వినుము
ఆధ్యాత్మముల మరి అధిభూతములను
ఆది దైవతంబుల నమరంగ నీకు
ఎఱుగ జెప్పెద నాటి నెరిగిన యెడల
ఎఱుకుదయించును ఎఱుపులో నీకు
సవురగు చర్మంబు శ్రవణ నేత్రములు
సవిశేష జిహ్వయు సరవిఘ్రాణంబు
జ్ఞానేంద్రి యములైదు జ్ఞాతతో నెఱుగు

మానిత శబ్దంబు మరి స్పర్శ రూపు
రసమును గంధంబు రహివిషయాలు
ప్రసరించు నీయైదు పడతిరో వినవె
గగనంబు వాయువు కమల బాంధవుడు
మిగిలి యప్పతి పృధ వికినధిపతియు

# కర్మేంద్రియాలు - వాని అధిపతులు

అదిగాక వాక్కును హస్తపాదములు
గుద గుహ్యములునివి గురుతైన కర్మ
హృషికములకు మరి హృదయంబు చెలియ

విషయాలు వినుమిక విస్తారముగను
పరగ బల్కిన పల్కు పట్టి దిద్దుటయు
అరయ నడ్పు విసర్గ మానందములును
అడర వీనికి గల్గు నధిదేవతలను
తడయక చెప్పెద తరుణిరో వినవె
అనలుడింద్రుండును హరియు మృత్యువును
వనర ప్రజాపతి పట్టి యుంచుదురు
పంతుమీరగనిది బాహ్య సంతతియు

## అంతరింద్రియాలు - వాని అధిపతులు

అంతరింద్రియ బృంద మది లెస్స వినుము
మనసు చిత్తము బుద్ధి మరియ హంకృతియు
వినువీటి కున్నట్టి విషయ సంతతియు
మనన విచారంబు మది నిశ్చయంబు
చనునభిమానంబు సరణి దేవతలు
శశియు జీవుడు బ్రహ్మ శశధరుండు విను
రసికత తోనివి రమణిరో కావు

## పంచప్రాణాలు

ప్రాణ పానోదాన వ్యానసమాన
నాణెము గానివి నాత్మలో నెరుగు



విరివైన ఈదేహ వికృతులు గావు
తరుచైన కామాది ధర్మముల్గావు
పాప పుణ్యము గాదు పాటింపనిన్ని
చీకటి వెలుగును చింతించి నెరుగు
ప్రాకటముగ నేర పడతిరో విన్మ
ఎరుక మరపు రెండు నెరుగుచుండేటి
ఎరుకవే నీనంచు నెఱుగుమా చెలియ

## సాంఖ్య విచారం

అతివరో సాంఖ్యంబు నహురంగ నీకు
అతి విశదము జేతు నదిలెస్సగాను
వర్ణక్రమంబున వరుస తోడుతను
నిర్ణయించెద దీని నీరజనేత్రి
వర్ణము లందేమి వరసమ్మతనిన
వర్ణ సంగతి నీకు వచియింతు తెలియ
అల అజా మేకామ టనిశ్రుతి బలుకు
నెలవున నావర్ణ నిశ్చయమెరుగు
సురుచిర లోహిత శుక్ల కృష్ణములు
నెరినీలమై యుండు నీలంబు గూడి
నాలుగు వర్ణముల్ నాక్షరమందు
నీలములోనున్న నిజతటిత్కాంతి

జీవాక్షరంబని చింతింపబడును
ఈవిధంబున శ్రుతి యెరుగంగ జెప్పు
నీలతోయద మధ్య నిదిగాక మరియు
అలర హిరణ్యా వర్ణామని శ్రుతియు
మొరపెట్టు చుండును ముదితరో వినవె
అరసి నీకొక సమ్మ తదియు జెప్పెదను
పరగ కృష్ణచ్ఛాయ ప్రకృత్యక్షరంబు
పోరయ పింగళ కాంతి పురుషాక్షరంబు
గలపుర్ష కృష్ణపిం గళ మని శృతియు (పురుష)
పలకుచుండావలి పరమ జెప్పెదను
మరియు విద్యుల్లేఖ మధ్యంబునందు
పరమాత్మయగు స్వచ్ఛ పరమాక్షరంబు
వెలుగుచుండును గాన వినుము సమ్మతియు
అలరతస్యాశిఖా యామధ్యయనుచు
సత్తుగా శ్రుతియిది జెప్పును వినుము
ఉత్తమ పురుషుడు ఉరుగీతలందు

అక్షయంబుగ బల్కు నాగీతలందు
అక్షరపరబ్రహ్మ మని జెప్పుచుండు
గట్టిగా దెలియుమీ ఘన సాంఖ్యరీతి
క్షరమును విడిచి య క్షరమును నెరిగి
పరము నీవని తెల్సి బ్రతుకుము చెలియ



# తారక లక్షణం

తారక విధమంత తరుణిరో నీకు
నేరుపు తోడు త నిర్ణయించెదను
వెలలేని పరశివ వెన్నెల బయలె
తెలియ చిత్రంబైన దివ్యమౌ యెుక
అపరిమిత పుతన యమల ప్రకాశ
నిపుణత తోతాను నెరయుచు జూచి
రూపింప రాని నిరూఢ ప్రకాశ
మేపార దరిలేదు యేనునవచ్చు
ననుచు నాశ్చర్యంబు నందగానట్టి
అనువైన యాశ్చర్య మందుద్భవించె
రాజ సాహంకార రమణి హిరణ్య
తేజ చిద్బిందువు దే దీప్యముగను
తారక తేజమై తగవిశ్వముగను

కారణమై విశ్వ గర్భంబునగుచు

గనుపట్టి యాబిందు గర్భంబునందు

పనిబూని శివకళ ప్రతిబింబమయ్యె
బెరసియా బిందులో బింబించగానె
నరుదైన కూటస్థ యాకృతి గలిగె
అవి రెండు గలయుగా నా బిందువందు
అవని పరాశక్తి యందుద్భవించె

అది సూక్ష్మనాదంబు నదియూర్ధ్వమగుచు

మితిలేని ఘోషతో మెరయుచు నుండు

భువనైక కర్ణికా బుద్బుదమందు
నిలిచి వెలింగెడి నిజమిది సుమ్మి
అల శశిమండల మదెయంద్రు బుధులు
తర్కింప వానికి తగ్గుగా నుండు
అర్కమండల మదే యరుణ వర్ణంబు
అనల మండలముండు నాదిగువందు
వినుత రక్త శ్వేత విభవ వర్ణముల
మనికైన యీమూడు మండలాలందు
బెనసి కలసియుండు బిందు నాదములు
పరచి యథోముఖ పద్ధతి నిట్లు
పరగ వైఖరి పల్కు పల్కులై పలుకు
అలవైఖరీ పల్కులవి యుజ్జగించి
పలుకు బిందువులోని పలుకాలకించు

అనువైన యాపల్కు లాలించి నెలవు
పనుపడ జెప్పెద పడతిరో వినుము
అనల శిఖల సోము డంటిన తావె
వినుము తారక లక్ష్య విధమదె నెలవు
ఖరజన్మ మరణ దుఃఖంబుల నెల్ల
తరియింపగా జేయు తారకంబుండు



ఇదియె నంతర్లక్ష్య మిదె నభో ముద్ర
యిదియె ఆపోజ్యోతి యిదె ప్రణవంబు
సలలిత శివకళ సత్తనబడును
చెలునగు చిద్బిందు చిత్తనబడును
అవి రెండు గలసుంటె ఆనందమగును (కలసి+ఉంటె)
అదియె లింగాంగాల కంత జెప్పెదను
అరయ చిద్బిందువే అంక పీఠంబు
ఇరవైన శివకళ యిష్ట లింగంబు
ఇదియె లింగాంగాల యిక్కువ సుమ్మి
విదితాన కుండలీ విధము జెప్పెదను
కొమరొప్ప నా బిందె కుండలియనగ (బిందువె)
సుమహిత నేత్రాగ్ర సుషిరంబు నదియె
ఈ విధ మంతయు నింతిరో నీవు
భావించి లోజూచి బ్రహ్మమై యుండు

ఆ చూపు విధమును నదియును గాక
ఆ చూపు చూడంగ నందుద్భవించు
తారక చిహ్నాల ధర్మమంతయును
కూరిమితో నీకు కుదుర జెప్పెదను
కనుగా నంతర్లక్ష్య గగనాన మనసు (కనుగొనన్+అంతర్లక్ష్య)
జొనుపుచు పౌర్ణమి చూపుల వరుస

# శాంభవీ ముద్రా లక్షణం

ఇదె శాంభవీ ముద్ర యింతిరో యిట్టి
విదిత ముద్రాభ్యాస విధమున నిల్పి
చూడచూడగ బుట్టు సొరిది చిహ్నములు
వేడుక తోడుత వివరింతు వినుము
చంద్రబింబము రీతి చెలువున మరియు
ఇంద్ర ధనుచ్ఛాయ నింపున నుండు
పన్నెండు వన్నెల పసిడి చందమున
పున్నమి వెన్నెల పోలిక వలెను
అల నవరత్నాల నాభాసరీతి
వెలుగు దీపంబుల విధమున మరియు
మినమిన మెరిసేటి మెరుపుల వలెను
ఇన బింబముల గతి యేపులో వెలుగు
సురు చిరమై వెల్గు చుక్కల భాతి
మెరసి కాల్చినయట్టి బిరుసుల వలెను

మండు మంటల రీతి మరియుండవలెను
మెండైన పొగవలె మిణుగుర్లవలెను
కలసి క్రమ్మినరీతి గాఢాంధ రీతి
సవిశేష రవికర సముదయ భాతి
నదులు గిరులు తరులు నంతరువులును
హరిహర బ్రహ్మాదు లాసురుల్ మునులు



వివిధ మాయాదృశ్య విశ్వమంతయును
అవిరళంబుగ దోచి యడగుచు నుండు
విసునక యిదిలెస్స విరివిగా జూడ
పసచెడి యాదృశ్య భంగమంతయును (భంగ = అల)
గనుచున్న దృగ్బ్రహ్మ ఘనవార్ధియందె
అనువుగా లీనమౌ నంత న ఖండ
పరిపూర్ణ మద్వైత పరమ కల్యాణ
నిరుపమామృత నిత్య నిర్మలంబైన
వెలలేని దృగ్బ్రహ్మ వెన్నెల బయలు
వెలిలోను లేకను విమలమై నిండి
వెలుగు కన్వెలుగౌచు వెలుగందె మాను
గలియ తాననియెడి ఘననహంకృతియు
గరగు నంతట చిదా కారమౌ బయలు
తరితీవు లన్నణగి తన్మయమంది

దృక్కు దృశ్య భ్రమ దొలగి ప్రశాంతి
మక్కువతో బొంది మరి ద్వంద్వ ముడిగి
తాను నేననియెడి తను చింత దొలగి
తానె తానై యుండు తరుణిరో యిట్టి
అనుభవార్థంబంత అది నీవు జూచి
వినుత స్వారాజ్యపు విభవంబు నొందు

## సృష్టి విధానం

పూని త్రికూటపు భూమికపైన
కానవచ్చెడి చోట కనిపించుచున్న
పంచభూతాల ప్రపంచ మంతయును
అంచితంబుగ నీకు నమర జెప్పెదను
పరచిదాత్మని వల్ల ప్రభవించె నభము
పరగ నంబరమున పడతిరో వాయు
జన్యమాయెను దాన జనియించె వహ్ని
ధన్యమా వహ్నికి తాబుట్టె జలము
జలముల వలన పృథ్వి జన్మంబునందె
ఆభూమి సకలాని కాధారమాయె

## పంచభూత వర్ణాలు

వీటి వర్ణాధిక విధమెట్టిదనిన
పాటించి వినిపింతు పద్మాక్షి వినుము
పీత వర్ణము భూమి ప్రియమైన జలము
శ్వేత వర్ణము మరి చెలువైన వహ్ని
రక్తవర్ణంబగు రమణి పవనము
యుక్త ధూమంబంద్రు యొప్పైన నీల
మాకాశమని కొందరార్యులీరీతి
ప్రాకటంబుగ తెల్ప పలుకుచుండెదరు



## మరియొక విధము

ఇదిగాక కొందరు నింకొక విధము
కదిపి చెప్పుదురది కలికిరో వినవె
అరుణ వర్ణము భూమి యని యంద్రు బుధులు
అరయ వైఖరియుల కార మాతృకయు
పటువు క్రియాశక్తి బరగుచు నుండు
ఘటిత త్రికూటంబు గల పీఠమచట
బంగారు బొజ్జయ్య పతి ప్రమాణంబు
అంగుష్ఠ మునుమరి అందులో సగము
నుండు నహంకార మువిద యచ్చోట
దండిగా నింతయు ధరణీ విధంబు
ఉరు తెలుపగువర్ణ ముదక స్వరూపు
పరగమధ్యమనాదు పటువకారంబు
చెన్నుమీరుచు జ్ఞాన శక్త్యచటుండు (శక్తి+అచట)
తిన్నని శ్రీహరి దివ్య పీఠంబు
రంగైన విష్ణువు రాజిచ్చటికిని
అంగుష్ఠ మాత్రమై యలరు మానంబు
అరయచిత్తంబందు నమరియు నుండు
నీరజ నేత్రిది నీరంబు రీతి
వరకృష్ణ వర్ణంబు వహ్నిని యంద్రు
తమమైన పశ్యతి తగురకారంబు

అమిత యిచ్ఛాశక్తి ఆడునిచ్చోట
విమలమౌ గోల్లాటి విభవ పీఠంబు
పొంగుచు రుద్రుండు పొసగధిపతియు
అంగుష్ఠమున సగ మాప్రమాణంబు
మతియందు వెలుగొందు మప్రనీయముగను
అతివరో యిదియంత యగ్నిలక్షణము
మరినీల వర్ణంబు మారుత మంద్రు
అరుదగు పరనాద మాయకారంబు
అల ఆదిశక్త్యట ననువుగా నుండు -
అలయౌట పీఠంబు, నలిగొని యుండు,
సంగతి యీశుండు సరణి నాయకుడు
అంగుష్ఠ మునసగ మందులో సగము
మనసు అచ్చోటను మాత్రమై నిలుచు
వనితరో నిదియంత వాయువిధంబు
ఆ పీతవర్ణము నాకాశమంద్రు
దీపించ వరముని దివ్యనామంబు

అలర సకారమౌ యచటి బీజంబు
అలసదా శివుడు తా నధిపతియగును
అమల పరాశక్తి ఆడునిచ్చోట
రమణీయమగు బ్రహ్మ రంధ్రపీఠంబు
అణురూపమనబడు నా ప్రమాణంబు
కడగియు నంతరం గమునాగనిదియె



కన్నియ రోయిది గగన పద్ధతియు
ఈరీతి భూతంపు లిక్కనలెరిగి
చేరియా వలిస్వచ్ఛ చైతన్యనభము

అదినీవు గానెరి గానందమొంది (ఎరిగి+ఆనంద)
కొదలేని బ్రహ్మన గూడుండు చెలియ (కూడి+ఉండు)

## మహావాక్య నిర్ణయం

అష్ట తనులరీతి యా మహావాక్య
నిష్ఠయంతయు లెస్స నిర్ణయించెదను
వర్ణక్రమంబులు వరుసతో నీవు
కర్ణపేయంబుగా కలికిరో వినుము
ఎఱుపైన స్థూలము కిల రజోసత్వ
మరయ విశ్వుడు దాని కధిదేవతగును
అల జాగ్రదావస్థ అకార వపువు (వపువు=మాతృక)
విలసిత నేత్రంబు విరివైన స్థలము
ధవళమై సూక్ష్మమై తగుసత్వ గుణము

అవిరళ తైజసుం డధి దైవముచట
అమరు స్వప్నావస్థ ఆఉకారంబు
కమనీయ మాతృక కంఠపదంబు
అవ్యక్త కారణ మట తమోగుణము
భవ్యప్రాజ్ఞుండధి పతియట కగును

సుప్తి యచటి యవస్థ సుమకారమాత్ర
లుప్త జీవోపాధి లెక్కింప నదియె
హృదయమే స్థానమై యుండను దినము
ఇదియె యజ్ఞానంబు యిదెయ విద్యయును
మదినెంచ నీలమె మహ కారణంబు
సదయ శుద్ధంబైన సాత్త్విక గుణము
నొంది తుర్యావస్థ శుద్ధ జీవుండు
నిరత మోంకారంబు నిల్చు మాతృకయై
పటుతరంబుగ మూర్ధ్ని పదమిదియంత
ఘటితమౌ పిండాండ కార్యత్వంపదము
ప్రియమైన ఎఱుపులో పీత వర్ణంబు
నయమౌ విరాట్టుకు నమ్మినతనువు
రాజసాహంకృతి రంజిత గుణము
తేజుండు బ్రహ్మయే తెలియధిపతిగ (తెలియు+అధిపతి)
అంచిత ఉత్పత్తి అచటియవస్థ

సంచితాకారంబు సరసమాతృకయు (సంచిత+అకార)
మించు గోమండలము మెలగు స్థానంబు (గో = సూర్యుడు)
కొంచక నిదిలెస్స కోమలి తెలియు
కడు తెల్పు లోపలి ఖర్జూరవర్ణ
మడరిహైరణ్యుని ఆత్మగుచుండు-
అటుగాన సాత్వికా హంకార గుణము



అటువలె విష్ణువు అధిదేవతచట
మండిత స్థితియట మహనీయవస్థ
దండి ఉకారంబు తగు మాతృకచట
మెండైన చంద్రుండు మెలగు స్థానంబు
నుండు ఈలాగున యువిదరో వినవె
అరుణ ములోపలి యతిశ్యామ రూపె
విరచిత వ్యాకృత విపుల దేహంబు
అచట తానుస గుణా హంకారముండు
అచలిత రుద్రుండు అధిదేవతచట
అతి ప్రళయావస్థ అచ్చోటనుండు
వితత మకారంబు విను మాతృకయును
చటుల వహ్నియు నట చెలగు స్థానంబు
ఘటితమై కలిగుండు కలికిరో వినవె
ఈతనువులు మూడు నీశుని మాయ

జాత జడోపాధి చర్చించి చూడ
నీలము లోపల నిగుడుచు నుండు
మేలైన స్ఫటికంబు మేలిమి ఛాయ
మాయదేహంబని మదిలోన దెలియు
ఛాయయే మాయని చెప్పుచుండుదురు (మాయ+యని)
లోలాక్షి వినుము ఈ లోకేశుడగును
లాలిత స్వరాటుండు లక్ష్మికి పతియు

అనుశుద్ధ సాత్వికాహంకార గుణము
యొనరి యోంకారంబు నుండు మా త్వకయి,
అలసర్వ సాక్షిత్వ మచటి యవస్థ
లలితార్థ చంద్రమౌ లావణ్య పదము
ఇదియంత బ్రహ్మండ మిదె కారణంబు
ఇదియంత తత్పద విధమని తెలియు
వినుచెలి యివిగూర్చె విధము జెప్పెదను
కను స్థూల సూక్ష్మంబు కారణ తనువు
త్వంపద వాచ్యార్థ తాత్పర్యమిదియు
నింపు తోడుత విను మింతిరో యనలి
పరమహా కారణ వైభవపదము
పరగత్వం పదలక్ష్య పద్ధతి సఖియ
తగవిరా డ్తనువును తలప హైరణ్య

మగుతను మరియు నవ్యాకృత తనువు
త్వత్పద వాచ్యార్థ తాత్పర్య మదియు
తత్పద లక్ష్యార్థ వైభవంబంత
సూచించితిని వీని సూక్ష్మమంతయును
యోచించి లెస్సగా యోగులమతము
ఈయష్ట తనువులు యిన్నిటి నడుమ
బాయకుండెడి తటిత్ప్రభయైన జ్యోతి
అసిపద రూపమై యాడుచునుండు



ప్రసరింప జేసి తా ప్రభలన్నిటందు
ఆటపాటై తానె అష్టాంగ ములకు
కూటస్థమై యుండు కోమలి యిట్టి
స్థిర తత్వమసియను త్రిపుటని త్రోసి
చారి యసిపదశిఖా సూక్ష్మ చిద్వలయ
మంటియీ త్రిపుటికి నైక్యంబు
అంటు సొంటును లేక ననల శేషించి
నట్టి నిర్గుణపద మదెనీవు గాను
గట్టిగా తలపోసి కడతేరు చెలియ
జలశర్కర న్యాయ సరణిది సుమ్మి
జలమున లవణంబు జెందు విధమ్ము
అలఘటాకాశ మ హాకాశములును
కలిసిన రీతిది కలికిరో వినవె
ఇదితత్వమసివాక్య విధమని తెలిసి
సుదతిరో ఈరీతి సుఖము భోగించి
ఇప్పుడు జెప్పిన ఈ యష్టతనువు
లిపుడు జెప్పినయట్టి ఆమహావాక్య
లింకొక్క విధమున నిపుడు జెప్పెదను

## రెండవ విధం

పొంకక వినుమిది పునరుక్తి గాను
జీవ వర్ణములైన జీవ దేహములు
భావింప మూడివి పరశివస్థూల
తనువగు నావలి తగునల తుర్య
తనువు నీశ్వరులింగ తనువని యంద్రు
కైవల్య తనుతటి త్కాంతి ఈశునకు
ఆవరించిన కారణాంశంబు నయ్యె
పరిగియా వలి శిఖా స్ఫటిక దేహంబు
తిరముగా నీశు తృ తీయంబునంద్రు
తగియున్న త్వంపద తగుచతు ష్టయము
చెలగి నిషేధించి శేషించినట్టి
వెలలేని అసిపద వివరమై యున్న
నిరవయ నిర్గుణ నిరుపమంబైన
పర యెఱుకేనని పాటించు చెలియ
నెరసి యీ చెప్పిన నిష్కర్ష కన్న
అరసిన నిష్కర్ష యది యొకరీతి
వెలసి చెప్పెద దీని విధములన్నియును
తెలియ సంశయమది తిరిగి రాబోదు
అందమంతయు గూడి నది స్థూలదేహ
మందంబు పైపిండ మదిలింగ దేహ



మవిరెండు త్వంపద మని చెప్ప బడును
అవిరళమై యున్న ఆపిండమందు
వెలయు కారణమైన విద్వదగ్రంబు
వెలయ తత్పదమని వివరింపబడును
అవల శేషించిన అసిపదమందు
కలసి అదేనీవు గా కను చెలియ (నీవుగా+కనుము)
మరియొక విధమున మరుపు రాకుండ
ఒరసి చెప్పెద లెస్స యూహించి వినుము

## మూడవ విధం

బింద్వైన ప్రీతమే ప్రియత్వంపదంబు (బిందువు+ఐన)
అందులో పలికళ యల్లారుముద్దు
అతిస్ఫటికంబైన యాలింగమూర్తి
అతివరో తత్పద మవిరెండు గలియ
అసిపదమగునని ఆత్మజ్ఞులంద్రు
విడువక నీవిది వివరణ దెలిసి
అట్టి స్వ రూపంబు అనుదినం బందు
మరువక చింతించి మరిసుఖం బందు
వెలిమూడు వర్ణముల్ వినుబాహ్య త్రిపుటి
తెలియ లోపలి వర్ణ త్రితయ మంతయును
అంతర త్రిపుటని అది జెప్పబడును

వింతైన నీలంబు విను సునీలంబు
వంతు మీరగ శుద్ధ స్ఫటికంబు గూడ
అంతరాంతర త్రిపుటని యంద్రు బుధులు (త్రిపుటి+అని)
ఈమూడు నిరసించి ఈమూటికవల
క్షేమమై వెలిగెడి శివుగూడి యుండు
ఏజాతి వాడైన ఎట్టివాడైన
ఏజాడ వాడైన ఈవిధంబంత
గురు ముఖంబున లెస్స గురిగాను దెలిసి
వరభక్తి యుక్తుడై వర్తించువాడె
పరమ ధన్యుండని పల్కువేదములు
పరమార్థ మంతయు బల్కి చూపితిని
విదితము గానిట్టి విధమంత దెలియ
మదిని సంశయములు మరిబుట్టబోవు
ఏజ్ఞానములు నింక యెన్నియేమిటికి
ఈ జ్ఞానమెరిగిన యెడల ముక్తియగు

సాధించి యిదిజూడ సకలార్థ సిద్ధి
సాధనంబున దీని సాధించు సఖియ
సాధనంబున గాని చవిగల్గబోదు
బోధ చేకూరదు పొలతిరో విన్మ
అలహి రణ్మయ బిందువని తెలియగనే
వెలలేని నీరూపు వెలుగుచు నుండు



అఖిల రూపుల కెల్ల నాధార మగుచు
సఖియరో నీరూపు సాక్షియై చూచు
అఖిల వేదంబులు అఖిల శాస్త్రములు
అఖిల వర్ణంబులు అఖిల రూపములు
అఖిల లోకంబులు అఖిల భూతములు
అఖిల చరాచరం బాబిందువందు
సుఖవశంబున నందు సొంపుతో నుండు
సఖియరో విను సర్వ సాక్షి కూటస్థు
అచలితా క్షరమూర్తి యంగుష్ఠ మాత్రు
డచట శుద్ధ స్ఫటి కాకృతి గలిగి
బందిపీ ఠమునందు పేర్మితోనున్న
చందమం తయు నీవు సఖియరో కనవె
ధామ దర్పణమందు తగిలించి మనను
చూడచూ డగనట సూక్ష్మస్వ రూపు

వేడకతో నిల్చి వెల్గుచునుండు
అదియె నీరూపంబు అతివరో కనుము
అదిగన మనసట నమనస్కమగును

# సారాంశం

కుంఠిత మవని వైకుంఠంబు నీల (అవని=కానట్టి)
కంఠంబు లోపల కనవలె జనులు

మంత్రాలు హఠయోగ మార్గంబులైన
తంత్రంబు లందున తరుచుగా జిక్కి
మాయా స్వరూపపమౌ మహిమలు గోరి
కాయమంతయు బహు కష్టపెట్టుదురు
రమణిరో మృదువగు రాజయోగంబు
క్రమము సద్గురు చేత కానంగలేక
ఘోర త పము జేసి కోరెదు మహిమ
గారదంబదిగాని గాబోదు ముక్తి
మహిమాది సిద్ధులు మాయకాపుర ము
కుదురు జేసుకనుంద్రు కొందరు దీని
ఇదిగాక మరికొంద రిలయెల్ల దిరిగి
ఉన్న తావున తమ నుండ జూచేటి
సన్నుతి గానక సకల తీర్థములు
చెన్నుమీరగ జనుల్ చేదిరిగి తిర్గి
తమ్ము దామెరుగక దరిగానలేక
నమ్మిక లేకను నష్టమైపోయి
కన్నకాళ్లకు మ్రొక్కి కడగానలేక
కన్న యోనులయందు కడుపుట్టి పుట్టి
ఉన్నరూపెరుగక యువిదరో జనులు
కన్నమార్గములకు కాళ్లు చాపుదురు
మతభేదముల జిక్కి మాయల జిక్కి



గతి గల్గునని భుజాల్ గాల్పించుకొంద్రు
కాల్చిన యంతనే గల్గునా ముక్తి
లోలాక్షి యిటువంటి లోకంపు భ్రమలు
కరిశౌచ భంగిని కడువ్యర్థ మగుచు
కరికపిత్థ న్యాయకంబునై యుండు
అడవి గాచిన వెన్నెలై పోవుచుండు
కడు ఫలంబేమియు కానంగరాదు
సాధు మార్గంబది సఖియరో గాదు
భేద మార్గంబిది పృథివిలో జూడ
వట్టి ఈ మతముల వనరంగ నేల (వట్టిది=ఉత్తది)
పట్టియా చెప్పిన పరబాహ్యమైన
నీరూపు నమ్మక నిజమైన పదము
చేరి సుఖించుము చెలియరో యికను
ఇన్ని త్రోవలు నేల నేజెప్పినట్టి
మన్నన విను నీవు మాటిమాటికిని
కన్ను చెదరనీక కనుగంట జూచి
నిన్ను నీవును దెల్వ నీవె బ్రహ్మంబు
నీకన్న యికలేదు నిజముగా దెలియు
నాకన్న యికలేదు నయముతో వినుము
నీకునాకును నేల యింత భేదంబు
ఏకమై వెలుగెద మేపులో జూడు

వెలిలోను లేకను విశ్వమంతయును
కలి సి వ్యాపించుక కనుచూడనీవె
చర లింగ గురు నాజ్ఞ సిరసావహించి
విరివి గాత్మైకంబు వివరించి తంత
అనుదిన మీ బోధ ఆత్మలో దలచి
కనుము జీవన్ముక్తి కల్యాణ శీల
వినరయ్య ఆత్మైక విజ్ఞాన ఘనులు

## కవిగారి విన్నపం

విన్నపంబొక్కటి విన్నవించెదను
చెలువైన లింగగురు శిష్యుండనగుచు
అలరు యోగానంద అవధూత స్వామి
నైనట్టి నేనునా గురువును దలచి
పూనికతోడుత బుద్ధిలో నెంచి
సకల వేదాంతంబు సారమైయున్న

అకలంక మాత్మైక మది విస్తరించి
ఒప్పైన ద్విపదగా నున్నదున్నట్లు
చెప్పితి దీనిని చిత్తగించండి
తప్పులు గలిగెనా తగదిద్దరయ్య
తప్పుదెల్పక దిద్ద ధర్మంబు గాదు
శంకలు వేలుండు శంకింపబోక



పొంకముతో దీని పూర్వాపరముల
అనుభవార్థంబంత అదిలెస్స దెలిసి
అనుదిన మీ బోధ నరయుడీ మీరు
యతిప్రాసముల గొడవేలను మాకు
గతి గురుడని తల్చు గతియతి మాకు
ప్రతిలేని గురుబోధ ప్రాసంబు మాకు
సతమైన గురుసేవ సకలంబు మాకు
మిక్కిలి విస్తార మేమిటి కింక
చక్కగా నీయైక్య చవిగనరయ్య

## ఫల శ్రుతి

ఈలోకమున జనులీ కృతివిన్న
పాలించి వ్రాసిన పట్టిచద్వినను
బుద్ధి కుదురై లెస్స బుధులను జేరి
శుద్ధులై యిహపర సుఖము జెందుదురు

క్రీ.శ. 1857 పింగళ నామ సంవత్సర వైశాఖ శు॥౧౪ సంపూర్ణం